# సారస్వతవ్యాసములు

కర్త:

కోరాడ-రామకృష్ణయ్య, ఎం. ఏ.,
ఆంధ్రోపన్యాసకుఁడు (రిటైర్డు).
మ ద రా సు వి శ్వ వి ద్యా ల య ము



మదరాసు.

[వెల: 1-8-0

# తొలిపలుకు

ఈ వ్యాసము లింతకుపూర్వము 'భారతి' మొదలగు పత్రికలలోఁ బ్రకటింపఁబడినవే. అచ్చటచ్చట ప్రకటింపఁబడి యున్న భాషాసారస్వత విషయకములగు నా వ్యాసముల నొక్క గ్రంథముగాఁ గూర్చి ప్రకటింపుమని కొందఱు మిత్రులు విద్యార్థులును బ్రోత్సహించుటచే, మద్రాసు విశ్వవిద్యాలయాధికారుల యనుజ్ఞఁబడసి నేనిందులకుఁ బూనితిని. సారస్వత వ్యాసములు మాత్ర మిందుఁ జేర్పఁబడినవి. భాషా విషయక వ్యాసములు వేఱొక సంపుటమగును. వీనిని బ్రత్యేకముగాఁ బ్రకటింప ననుజ్ఞ నొసఁగిన భారతీ పత్రికాధిపతులకును, విశ్వవిద్యాలయాధికారులకును నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

కో. రామకృష్ణయ్య.

# సారస్వత వ్యాసములు

## జాతీయజీవనము - వాఙ్మయము

సామాన్యముగా జాతీయజీవనము తద్వాఙ్మయమునఁ బ్రతిబింబితంబై యుండుననువిషయము నితరభాషావాఙ్మయ పరిచితి లేని కేవల హైందవ విజ్ఞానధురంధరు లగు మనవారు కొందఱు పాటింపరేమో కాని, పాశ్చాత్య వాఙ్మయములను, అచ్చటి విమర్శకాభిప్రాయములను బరిశీలించినవారి కెల్లర కును అది వాఙ్మయవిషయమున నొక ముఖ్యతత్త్వముగ గోచరింపక మానదు. ఏతత్తత్త్వావగాహనకు దేశచరిత్ర జ్ఞానము కూడ కొంచె మావశ్యకమని తోఁచెడిని. దేశమున నొక్కొక్క కాలమునఁ గల్గు వివిధరూపంబు లగు విప్లవ ములు జాతీయజీవనము నెట్లు మార్చుచుండునో అట్లే భాషా వాఙ్మయములను గూడ మార్పఁగలిగి యుండును. ఒకవేళ మనవా రీ విషయము నంతగా గమనింపకున్నను, దేశచరిత్ర రచనా విషయమున నాదినుండియు తూష్ణీంభావము వహించి యెల్లప్పుడును పరమార్థచింతాతత్పరులైన వీరియెడల నిది యంత యాశ్చర్యజనకము కాదు.

మన మొక మహా కవిచే రచింపఁబడిన యొక గ్రంథము చదువుచుండినచో, అద్దానఁ జిప్పిలుచుండు రసం బులు మన మనోభావంబుల నాకర్షించి యానందమున నోల

లాడించునుగదా. అన్నుడొకవేళ మన పరిశీలనాబుద్ధి మాటు వడి యుండవచ్చునుగాని, మఱియొకసారి దానిం బరిశీలనతోఁ జదివిన, ఆ గ్రంథమునందలి పాత్రల చర్యలనుండియు, వారి సంభాషణ క్రమమునుండియు, భావములనుండియు అట్టి పాత్రల నాడించు నాంతరశక్తి యగు నా గ్రంథకర్త యభి ప్రాయములఁ గనిపట్టుట యంత దుస్సాధ్యము కాఁబోదు. కవుల స్వాభిప్రాయసూచన నెంతమాత్రము సహింపని నాటకాది రూపకములలో నిది మిక్కిలి దుస్సాధ్యమనియే చెప్పవలసి యున్నను, సామాన్యముగా ప్రతిగ్రంథము వెనుకను మాటు వడియో దాని నంత నావరించియో లేక నడుమ నొకచోఁ బొడసూపుచుండియో ఆ కవి చనువరులకుఁ గన్పట్టుచునేయుం డును. మఱియు ప్రతిమనుజుని భావములును-భావ మననేల— వాని జీవితమంతయు నాయాకాలముచే నిర్ణీతంబై యుండును: అనఁగా వాని జీవిత మా కాలమునందలి సాంఘికాదిపరిస్థితుల నాశ్రయించియుండు ననుట. కావున నొకసంఘమునందలి ప్రతి వ్యక్తియొక్క యాశయములును ఆ సంఘజీవితమును వ్యక్తీకరించుచునేయ డగు నొక కవిచే రచియింపఁబడిన గ్రంథకర్త యభిప్రాయములను మాత్రమే సేకరించుట లేదు. సాధారణముగా నొక కవి తన దేశకాల వ్యవస్థలకు లోనై సాంఘికవ్యవస్థలను, జాతిమత వికాసములను బయలుపఱచు చునేయుండును గావున నా యుగమందలి వాఙ్మయమునం దంత టను ఆ కాలమున నా జాతియొక్క స్థితిగతు లన్నియు సూచింపఁబడుచునేయుండును. ఒకవేళ నొక కాలమున నొక

రిద్దఱు మహామహులు దేశకాలవ్యవస్థల నధిగమించి సార్వ జనీనంబులును పరమోత్కృష్టంబులు నగు భావములను, ఆదర్శములను తమ గ్రంథముల వెలయించినను, ఆకాలమున వాఙ్మయమంతయు నట్టిదై యుండుట గాని, ఎంత గొప్ప కవు లైనను, తమ గ్రంథరాజముల నెచ్చటనైనఁ దమ చుట్టు ప్రక్కల దేశముననో సంఘముననో యుద్రేకము పుట్టించి తన్మయంబు గావించుచుండిన తాత్కాలిక మహోద్యమ విషయములను స్వాభావిక మగు పొరపాటువనైనఁ గనఁబఱుప కుండుట గాని తటస్థింపదు. ఈ రీతిగా నొక దేశమున నొక కాలమందలి వాఙ్మయ మచ్చటి జనుల మనోవీధుల నెడతెగక పాఱుచుండెడి భావప్రవాహమును, వారి జీవితచరితను దనలో కేంద్రీకృతమగునట్లు చేసి అప్పటి సంఘస్థితి ననశ్వరంబును శాశ్వతంబును నగునటు లా దేశమున నెలకొల్పు ననుటకు సంశయము లేదు.

ఇట్లు వాఙ్మయము దేశచరిత్రజ్ఞాన సంపాదనమునకుఁ దోడ్పడుననుట వ్యక్తమే అట్లే దేశచరిత్రయు వాఙ్మయాభి వృద్ధికిం దోడ్పడెడి యాయా కారణముల నిరూపింప సమర్థంబై యుండును. చరిత్రకన్న వాఙ్మయమున నొక్క విశేషము కలదు. చరిత్ర యాయా దేశములం గల్గు వివిధోద్యమ ములను వాని వికాసమును, అచ్చటి రాజకీయార్థిక సాంఘిక నైతిక స్థితులను వర్ణించి, అయా యుద్యమంబులకును వాని పరిణామములకును కారణముల నారసి నిరూపించుచుండ ఈ వాఙ్మయ మట్టి యుద్యమకారణంబులకు మూలంబు ,లగు జనుల భావోద్రేకములను, వారి యంతఃకరణవృత్తులను విశద

పఱచును. మఱియు నిది దేశమునఁ గలిగిన రాజకీయ విప్లవ ములవలనఁ గాని, అన్యదేశీయ భాషా సంసర్గమువలనఁ గాని ఆ జాతీయజీవనమునఁ గలిగిన మార్పులను గూడ విస్పష్టంబుగఁ దెల్పుచుండును కావున దీని సంబంధం బతిసన్నిహితంబని యెంచఁదగి యున్నది

ఇంగ్లండు దారా ణము నిప్పుడు మనదేశమున బాగుగా వ్యాపించి మిగుల నెన్నికగన్న యాంగ్లవాఙ్మయముం జూడనగును. ఆ దేశమున జాతీయజీవన మే కాలమున నెట్లు మారుచువచ్చెనో తదనుగుణంబుగనే కవితయందలి రుచియు మారుచువచ్చెను. ఈ కవితారుచికిఁ దగినట్లుగనే విమర్శన పద్ధతులును ప్రబలినవి. అప్పు డేయే భావము లాదేశీయుల మనముల నాకర్షించి యుద్రేకము గల్గించుచుండినవో అవియే యా యుగమందలి కవితయందును స్ఫురించుచుండినవి ఆంగ్ల దేశమున పదునాలవ శతాబ్దమునకుఁ బూర్వము వాఙ్మయ మున చేయఁదగిన కవిత మిగుల స్వల్పమేయని చెప్పనగును. ఈ 14-వ శతాబ్దమందలి తన దేశీయుల స్థితిగతులను, మతాచార ముల దుస్థితిని, భాషావైఖరిని దెల్పుచు "ఛాసరు" అను కవి "కాంటర్‌బరీ కథలు" అను గ్రంథమును రచించి యున్నాఁడు. పదునాఱవ శతాబ్దమున ఆంగ్లదేశీయ నావిక శిఖామణుల యద్భుత యాత్రలవలనను, వారిచేఁ గనుఁగొనఁ బడిన నూతనఖండముల పరిజ్ఞానమువలనను వారికి సముద్రములు స్వాధీనమై వారు పరదేశములతో సులభముగ వ్యాపారము చేయఁగలుగుటచే దేశ మొక్కమారుగ ధనవంత మగుట వలనను దేశీయులకుఁ గలిగిన యపరిమితానందోత్సాహముల

యద్భుత ఫలమో యన్నట్లా కాలమున షేక్స్పియర్, సిడ్నీ స్పెన్సర్ మొదలగు మహాకవీంద్రులు బయలు వెడలి, తమ యూ యుత్సాహము నప్రతిమానం బగు కవితారూపమున వెలయించి యాంగ్లవాఙ్మయమున నగ్రపీఠిక నలంకరించిరి. తరువాత పదునేడవ శతాబ్ది మధ్యమున దేశమున సంభవించిన రాజకీయములును మతవిషయకములు నగు కల్లోలముల నన్నిటిని ఆ కాలమున కవిసార్వభౌముఁ డగు మిల్టన్ వ్రాసిన గ్రంథములనుండి బాగుగఁ దెలిసికొనవచ్చును. మఱియు నీ శతాబ్దము యొక్క యుత్తరభాగమున ప్రజాప్రభుత్వము పోయిన పిదప నాంగ్లసింహాసనము నధిష్ఠించిన రెండవ చార్లెసు నకు ఫ్రెంచిదేశముతో సంబంధమును, దానియం దభిమానము గలుగుటవలన నాదేశీయు లగు మాల్హర్బీ బొయిలూ మొదలగు వారి కవితారీతులును విమర్శన పద్ధతులును ఈ దేశమున వ్యాపించి యిచ్చటి కవితాపద్ధతులను గూడ మార్చినవి. దీనితో కవితయందలి పూర్వపు రుచి మాఱి కవితాప్రవాహము మాఱుత్రోవఁ బట్టినది. అప్పటి కవులు భావనాశక్తిని కొలుచుట మాని, అతి విశదంబును వ్యక్తంబును నగు శైలిలో ఆ కాలమునఁ బ్రబలిన జీవనపద్ధతులను కాఫీక్లబ్బులను చీట్లాటలను పానగృహములనుగూర్చి చమత్కారముగ వర్ణింపఁ జొచ్చిరి. తమ కాలపు జీవనపద్ధతులను అభిప్రాయములనుబట్టి చూచుటచే, వారికి షేక్స్పియరు మొదలగువారి కవితలయం దాదరము లేకుండెను. పదునెనిమిదవ శతాబ్దమున నైరోపా దేశము నెల్ల నొక్కమాఱుగా కలఁత నొందించిన గొప్ప రాజకీయ విప్లవము ఫ్రాన్సుదేశమున బయలుదేఱినది. దీనికి

వ్యక్తిస్వాతంత్ర్యము విశ్వజన సౌభ్రాత్రము మొదలగు నుదారభావంబులు జనుల మనంబులం దుదయించుటయే ముఖ్యకారణము. ఇంగ్లాండు దేశమునకుఁ గూడ నీ నూతన భావములు ప్రాఁకినవి. ఇచ్చటి మహాకవుల మనంబులును అట్టి గంభీరభావములతోఁ బొంగిపొరలినవి. మరల కవితయందలి రుచి మాఱి, పూర్వ కవితయందును ప్రాచీన మగు దేశ చరిత్రయందును ఆదరము హెచ్చినది. 17-వ శతాబ్దమునఁ బ్రబలిన కవితాపద్ధతులపై నాదరము పోయినది. ప్రకృతియే వీరి నూతనభావములకును కవితకును గూడ నుద్బోధకం బయ్యెను. షెల్లీ, బైరన్, కోలరిడ్జి, వర్డ్సువర్తు మొదలగు వారీ స్వాతంత్ర్యాదర్శనమును ప్రకృతిపై చిత్ర్యములను అనేక రీతులఁ గొనియాడి యాంగ్ల వాఙ్మయమున మరల సహజ కవితను నెలకొల్పి యొక నూతనయుగ మేర్పఱచిరి. 19-వ శతాబ్ద మాంగ్లదేశమున నొక గొప్ప పారిశ్రామికయుగ మని చెప్ప వచ్చును. ప్రకృతిశాస్త్రము విశేషముగ నభివృద్ధి గాంచినది. జాతీయజీవన మనేక విధములై పర్విసది. దీనిని వాఙ్మయమున నెలకొల్పుటకు నవలలు విశేషముగఁ దోడ్పడినవి. యంత్రాగారములలోఁ బ్రబలిన కొన్ని యమానుష కృత్యంబులను సంస్కరించుటకు లేడీబ్రౌనింగ్ డికెన్సు మొదలగువారి వ్రాతలు సహాయపడినవి. టెనిసన్ మనుకవీంద్రుఁ డాకాలపు దేశోద్ధారకులను గొనియాడి యనేకవిధము లగు యుగధర్మములను కవితయందు నెలకొల్పి ఈ యుగమునకు వాఙ్మయమున శాశ్వతపదవిని కల్పించినాఁడు. కావున ఆంగ్లవాఙ్మయ పఠనంబున నేయే యుగముల నేయేధర్మములు ప్రబలినవో

ఆ జాతియొక్క జీవనపద్ధతు లేయేరీతుల మార్పు చెందినవో కనఁగొనుట సులభసాధ్య మను మాట విశద మే యగుచున్నది గదా.

ఇఁక, హైందవవిజ్ఞానమున కంతకును మూలాధారం బగు సంస్కృతభాషావాఙ్మయ మా జాతీయతత్త్వము నెట్లు స్ఫురింపఁజేయుచున్నదో చూతము. ఏతత్పరిశీలనా విషయమున నాంగ్లవాఙ్మయమునకును సాంస్కృత వాఙ్మయమునకును నొక్క భేదము కలదు. ఆంగ్లభాషయందు తద్దేశ చరిత్రను తెల్పు ననేక గ్రంథములు కలవు గాని, సంస్కృతవాఙ్మయము మిగుల ప్రాచీన మగుటవలనను, అప్పటికాలపు చరిత్రను దెల్పు నితరాధారములు లేకుండుటవలనను, ఉన్న వాఙ్మయమును బట్టియే మన మా కాలపు చరిత్రను నిర్ణయింపవలసియున్నది. ఇప్పటికి నాలు గైదు వేల యేండ్లనుండి వచ్చిన వాఙ్మయమునుండియే, మన మా కాలమున నివసించి యుండిన హైందవజాతియొక్క స్థితిగతులను, వారి నాగరికతను తెలిసికొనఁగలుగుచున్నా మను విషయమే జాతీయ జీవనమునకును వాఙ్మయమునకును గల సన్నిహిత సంబంధమునకు ప్రబలంబగు నిదర్శనము. హైందవ విజ్ఞానమునకు మూలము లగువానిలో ప్రాచీనతమంబు లగు ఋగ్వేదమంత్రములు, ఇతర దేశములలో నాగరకతాగంధమే లేని కాలమునాఁటి హైందవుల నాగరకతా గరిమను చాటుచున్న వని పెద్దలు చెప్పుచున్నారు. చారిత్రక దృష్టితో పరిశీలించినపుడు హిందార్యుల నాగరకత ఋగ్వేదకాలమున పసితనమున నున్నదందురు. అప్పుడు వారిలోఁ గొంతమంది వ్యవసాయము

వలన జీవించుచున్నరు. చాలమంది పశుచారణోపజీవులనియు, మంత్రరచనాపటిష్ఠులగు బ్రాహ్మణులే విల్లంబులను బూని తమ శత్రువులతోఁ బోరుచుండెడివా రనియు, స్త్రీలుకూడ మంత్రములు రచించుచుండెడివా రనియు వారు బట్టలను నేసికొనుచుండెడివా రనియు, ప్రకృతియందు గోచరములగు వైచిత్ర్యములనే వా రారాధించెడివా రనియు, తదారాధనా రూపములే యీ ఋగ్వేదమంత్రము లనియు తెలియవచ్చుచున్నది. కాలక్రమమున నిట్టి యారాధనయందు శ్రద్ధ తగ్గిన కొలఁదిని ఆ జనులకు క్రతువులయం దాదరము హెచ్చెను. ఈ క్రతువిధానముల నుద్గాత్రధ్వర్యులకు విధింపఁబడిన కార్యక్రమమును ననుసరించి వీరు పఠింపవలసిన మంత్రసముదాయమే సామయజుర్వేద రూపంబులు చెందినట్లును, వీరి కార్యక్రమమును నడుపవలసిన రీతులను ఆయా సంహితలయొక్క యాంతర్యార్థమును చెప్పు గద్యరూపంబులైన వ్యాఖ్యానంబులే బ్రాహ్మణము లనియుఁ గూడ దెలియవచ్చుచున్నది. ఈ బ్రాహ్మణముల కాలము వీరి జాతీయజీవితమునకు వాఙ్మయమునకుఁగూడ రెండవ యుగమని చెప్పవచ్చును. ఈ కాలమున నార్యులు కర్మపరులును తత్త్వవిచారణావ్యగ్రులు నై యుండిరి. ఇప్పుడే వర్ణధర్మములు కూడఁ బ్రబలినవి. వార్ధకమున జను లరణ్యములలో వసియించుట యనెడి యాచారము వాడుకలోనికి వచ్చినది. బ్రాహ్మణాంతర్గతములైన యారణ్యకము లను భాగములు తత్త్వవిచారణారూపంబులును ఉపనిషత్తులకు మూలభూతంబులు నై వెలసినవి. ఇవన్నియుఁ బూర్వయుగమందలి మంత్రములవలె

ఛందోబద్ధములు గాక గద్యరూపంబుననే రచియింపఁబడినవి. పిదప నుపనిషత్తుల యుత్కర్ష హెచ్చి కపిలుఁడు సాంఖ్యదర్శనమును వ్యాపింపఁజేయునప్పటికి ఋత్విక్కుల ప్రాబల్యము తగ్గినది. ఇది మూఁడవయుగము. ఈ కాలమున సంహితాబ్రాహ్మణము లయందలి యంశములను సులభముగ బోధపఱచుకొనుటకుఁగాను వానిని క్లుప్తపఱుపవలె నను బుద్ధితో సూత్రములను వెలయించిరి. ఇంకను వివిధశాఖల హైందవవిజ్ఞానమంతయు సూత్రములలోనికి వచ్చినది. నాగరికత హెచ్చినది. వాఙ్మయము వృద్ధి చెందినది. వైదికకర్మకలాపం బంతయు శ్రౌతసూత్రముల నింపఁబడినది. ఆచారవ్యవహారములు నిర్ణయించుటకు గృహ్యసూత్రములు, పరిపాలనాక్రమమును దెల్పుటకు ధర్మసూత్రములు. ప్రాతిశాఖ్యలు, శిక్షాసూత్రములుఁ పాణిని వ్యాకరణసూత్రములు, ఛందస్సూత్రములు మొదలగునవి బయలుదేఱినవి. హైందవవిజ్ఞానమున కంతకు నలంకారభూతంబులగు షడ్దర్శనములును బయలుదేఱినవి. ఇవి యన్నియు నా కాలమందలి హిందువుల యాత్మజిజ్ఞాసను అగాధం బగు బుద్ధిబలంబును వారి నాగరికతావికాసంబును వేనోళ్ల చాటుచున్నవి. ఈ కాలమున సాంఘికజీవనమున పెక్కుమార్పులు జరిగినవి. బ్రాహ్మణుల యధికారము విజృంభించినది. ఋగ్వేదమతమునం దావేశము తగ్గినది. త్రిమూర్తులు మొదలగు ననేక దేవతలు వెలసిరి. అర్థము లేని కర్మలు ప్రబలినవి. జాతివైషమ్యములు నంత్యజాతియందనాదరము నంకురించినవి. ఇట్టి సమయమున గౌతమబుద్ధుఁడు బయలుదేఱి, వర్ణభేదమువలన గొప్పతనము రాబోదనియు,

సత్ప్రవర్తనవలన నరుడు ముక్తిఁ బడయఁగల రనియు, జీవహింస కూడదనియు - ని మొదలగు బోధలు చేయుటచే, జనసామాన్యము నొక్కసారిగా నాకర్షింపఁగలిగెను. అప్పటి నుండియు బౌద్ధమత మంతకంతకు వృద్ధిచెంది యశోకునికాలమున దిగంతవ్యాప్తి చెంది హిందూమతము నణఁచివేసినది. పిదప, హిందూదేశము పరదేశీయుల దండయాత్రలకు లోనై చాల కాలమువఱకు శాంతి లేక యుండెను. ఆంధ్ర, గుప్త విక్రమాదిత్యుల కాలమునఁ గొంత శాంతి గలుగుటచే హిందూమతము మరల గొంత తలయెత్తుటకును, కాళిదాసాది మహాకవుల కవితా విజృంభణమునకును కొంత యవకాశము దొరకినది. కాని, క్రమక్రమముగ సామాన్యజనులలో విద్యావ్యాప్తి తగ్గుచుండుటచేతను, కవులకును సామాన్యజనులకును సంబంధము తగ్గుటచేతను, దేశము మహమ్మదీయుల కధీనమైన పిదప జాతీయభావమే నష్టప్రాయమగుటవలనను, తరువాతి కవితకును జాతీయజీవనమునకును అంత సంబంధమున్నట్లు కనఁబడదు. సహజకవిత తగ్గిన కొలఁది కవితావిమర్శన ప్రబలి యాలంకారికగ్రంథములు బయలువెడలినవి. ఈ యాలంకారికుల నిబంధనలను దాఁటిపోకుండుట కూడ కవుల కాచారమైనది. ఇట్లు హైందవ వాఙ్మయము ప్రాచీనార్యుల జాతీయ జీవనపద్ధతిని విశదము చేయుచునే యున్నది.

ఇంతకుఁ బూర్వము చాల కాలము క్రిందటనే యార్యులు దక్షిణహిందూస్థానమునకు వచ్చియుండుటచే హైందవవిజ్ఞానమచ్చట వ్యాపించుటే గాక క్రమముగఁ గొంత కాలమునకు సంస్కృతభాషా సంసర్గమువలన దేశభాషలయందు వాఙ్మ

యాభివృద్ధికి చేయూఁత దొరకినది. చాల కాలమువఱకును సంస్కృత ప్రాకృతభాషలకే రాజావలంబనము లభించుట వలన దేశభాష లభివృద్ధి చెందుటకు వీలు లేకయు న్నను, క్రీ. శ. 7-వ శతాబ్ది ప్రాంతమున వేఁగిదేశమును జయించిన చాళుక్యప్రభువులు దేశి కవిత నీ దేశమున నెలకొల్పి నట్లు నన్నిచోడ మహాకవి తన కుమారసంభవకావ్యమునందు

"మును మార్గకవిత లోకం।
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం।
గున నిలిపి రంధ్రవిషయం।
బునఁ జనచాళుక్యరాజు♦ మొదలుగ పలువుర్ ॥"

అను పద్యమునఁ దెల్పియున్నాఁడు. ఇట్లు సత్యాశ్రయునిచే నాటఁబడిన దేశి కవితామృతము సంస్కృతభాషావాఙ్మయము లను దోహదముచే క్రమముగ వృద్ధిచెంది రాజనరేంద్రుని నాఁటికి పుష్టి గాంచి యమూల్యము లగు ఫలముల నిచ్చినది. సంస్కృతవాఙ్మయమే దేశమున నెక్కుడాదరము వడసి యుండుటచేతను, పండితులు కవులు నగువా రీ భాషయందే యభిమానము కలవా రగుటచేతను దేశభాషలోని దేశీయ కవిత యప్పటి సంస్కృతపండితుల యాదరమును బడయు గల శిష్టకవితను పుట్టించునంతటి స్థితిలోనికి రాకుండుట చేతను, సంస్కృతగ్రంథముల భాషాంతరీకరణములే ప్రథమ మున నీ దేశీయవాఙ్మయమున ప్రసిద్ధిగాంచిన గ్రంథము లగుట తటస్థించియుండును. మఱియు నప్పటికి దేశమున

♦ సత్యాశ్రయునితొట్టి చాళుక్యనృపుల్.

వ్యాప్తిఁ జెందియున్న బౌద్ధజైనమతముల నణచివేసి సామాన్య జనులలో వైదికధర్మములను వ్యాపింపఁజేయు నుద్దేశముతో నా ల విజ్ఞానంబులకు నాలవాలం బైనట్టియు భారతేతిహాసంబును పురాణంబులను దేశభాషలోనికిఁ దెచ్చిరి. త్రికూటకసోమయాజి చెప్పినట్లు "భారతామృతముఁ గర్ణపుటంబుల నారఁ గ్రోలి యాంధ్రావళి మోదముం బొరయఁ గల్గు" నని యప్పటివారు తలంచిరి. కావుననే యీయుగ మాంధ్రవాఙ్మయమున భాషాంతరీకరణయుగమై వెలుఁగొందినది. కాని, ఈ యుగమున కంతకును, ఈ యుగమున కేమి—ఆంధ్రవాఙ్మయమున కంతకును, అలంకారం బగు నాంధ్రభారతము కేవలాంధ్రీకరణమని చెప్పుట సమంజసము కాదు. దీనిని కేవలాంధ్రీకరణముగ భావించి మూలముతో నచ్చుటచ్చుట సరిచూచి ఆయా పట్ల మూలముకన్న కొంత భేదముగనుండుటయే గాక, ఎక్కువ రసవంతముగను రమణీయముగను నుండుటను గనుఁగొనియు, పూర్వపు ప్రమాణముచేతనే దీనిని విమర్శించి మూలమునకు సరిగ లేదని కొందఱాక్షేపింతురు. కాని యొక విధముగు దోషముగ నెన్నంబడుచున్నను ఈ గుణమే దీని యుత్కృష్టతకుఁ గారణము. కావున, భాషాంతరీకరణమైనను, ఈ గ్రంథమును మూలముకన్న రసవంతముగను రమ్యముగను జేయు నుద్దేశముతోడనే తిక్కనాదులు కొంత స్వాతంత్ర్యమును దీసికొనియుండిరి గావున, నీ యుగముననే రాఁబోవు యుగము నందలి స్వతంత్రగ్రంథముల చిన్నెలు కొంతవఱకు పొడసూపియుండినవని చెప్పనొప్పును. మొత్తముమీఁద నీ యుగమునందు

మతాభిమానమే వాఙ్మయప్రవాహమును నడపినదని చెప్ప వచ్చును.

క్రమముగ కవులకీ భాషయం దభిమానము హెచ్చుటయు, సంస్కృతకావ్యాదుల ననువదించుటయే గాక తమ స్వతంత్ర కల్పనాశక్తిని వర్ణనాచాతుర్యమును ఎక్కుడుగ చూపవలె ననెడి యభిలాష బలమగుటచే మూలగ్రంథముల నుండి కథను గొన్ని కల్పనలను మాత్రమే తీసికొని స్వకల్పనలచేఁ బెంచి భాషాంతరీకరణమునకును స్వతంత్ర గ్రంథమునకును మధ్యస్థముగ నుండునట్లు చేయుచువచ్చిరి. దీనికి శ్రీనాథుఁడే ముఖ్యోదాహరణము. ఈతనిని భాషాంతరీకరణయుగమునకును కావ్యయుగమునకును నడుమ రెంటిని కలుపుచుండెడి యొక వంతెనకుఁ బోల్పవచ్చును. 14-వ శతాబ్ది ప్రారంభమున ప్రతాపరుద్రదేవుని యాస్థానమున నుండిన విద్యానాథుఁడను సంస్కృతకవివలెనే ఆతని మంత్రులకుఁ గాని దండనాథులకుఁ గాని కృతియిచ్చిన మారన, మంచన భాస్కరకవి మొదలగువారి గ్రంథములవలన నా కాలపు స్థితిగతులు తెలిసికొనగలిగినట్లే, పదునైదవ శతాబ్దమున నున్న శ్రీనాథుని గ్రంథములవలన నాకాలమందలి రెడ్ల చరిత్రను నాంధ్రజనుల స్థితిగతులను గూడ విశేషముగాఁ దెలిసికొనఁగలుగుదుము. తరువాత 16-వ శతాబ్దమున నాంగ్లదేశమందువలెనే కృష్ణదేవరాయల భుజపీఠిక నలంకరించి మహోన్నత పదవి నొందిన యాంధ్రభూమియందు నొక నూతనవికాసము గలిగి రాజకవియు కవిరాజును నగు నాతని ప్రాపున కవితాసతి నూతన తేజంబు వడసినది. ఈ కాలమున నాంధ్రదేశమందు

వలెనే యాంధ్రసారస్వతమునను స్వాతంత్ర్యగుణము నెలకొల్పఁబడినది. సంస్కృత గ్రంథములను దెనిఁగించుట మాని యేపురాణమునుండియో యొక గాథను దీసికొని దానిని తన రచన కనుకూల మగునట్లు పెంచి రసవంతము లగు స్వతంత్ర కావ్యములను రచించుటకుఁ బ్రథమమున దారితీసినవాఁడు రాయల యాస్థానకవి యగు పెద్దనార్యుఁడు. ఇంక నీ యాస్థానమునుండి యష్టదిగ్గజము లని పేరువడసిన ముక్కుతిమ్మనాదులీ దారినే పోయి యనేకము లగు స్వతంత్ర ప్రబంధముల నాంధ్రవాఙ్మయమున కలంకారములుగఁ జేసిరి. కృష్ణదేవరాయలు దక్షిణహిందూస్థానము నేలిన రాజు లందఱిలో గొప్పవాఁ డనియు నాతని పరాక్రమము వైదుష్యము కవిజనంబులయెడ నాతనికిఁ గల యాదరమునేగాక యప్పటిజనుల జీవిపద్ధతులు, భావములు మొదలగు విషయముల నాకాలపు పెద్దన, తిమ్మన, మల్లన, ధూర్జటి మొదలగువారి కవితలనుబట్టి మనము గ్రహింపఁగలము. ఇట్లే ఇఁక తరువాతి కవులుకూడ పెద్దన చూపిన ప్రబంధసరణినే గతానుగతికముగ ప్రవర్తించుటచేతను, తమ పాండిత్యప్రకర్ష చూపుటయే ఆ కాలమున నొకగుణముగ పరిగణింపఁబడుటవలనను, క్రమముగ కవితకు వికాసము తగ్గుటయేగాక ఆ కవిత యా యా కవుల కాశ్రయు లగువారి వంశచరిత నొక్కింత మనకుఁ దెల్పుచుండెనే గాని, ఆంధ్రదేశమునందలి జనసామాన్యముయొక్క స్థితిగతులనరితగాఁ దెలుపునదిగా లేదు. ఇది యది యననేల? సామాన్యముగ నాంధ్రవాఙ్మయ మంతయు అట్టిద యని చెప్పవచ్చును. ఇంతకు నీ దేశమునందలి కవిత రసజ్ఞ

లగు కొందఱు రాజులపోషణమువలన వృద్ధి చెందిన దగుట వలన నాకవులును తమ కాశ్రయులై తమ్ము పోషించుచున్న వారి ప్రభావంబును, వంశావళియుఁ గొంత వర్ణించి యాశ్వాసాంతముల మఱి రెండు మూఁడు బిరుదావళులు చదువుచుండుటయేగాని వారి కారాజ్యమందలి జనులయొక్కగాని సామాన్యముగ నాంధ్రజాతియొక్క గాని స్థితిగతులను ఆశయములను వర్ణించుట కుత్సాహముకలుగలేదు. దీనికి కారణ మాంధ్ర జాతీయస్వాతంత్ర్యము కొంతకాలమైన నెడతెగక లేకుండుటయే. కొందఱు రాజు లాంధ్రకవుల నాదరించి యాంధ్రవాణి నుద్ధరించినను, దేశమున శాంతి తక్కువ యగుటచే జాతీయ జీవనమున కంతగా ప్రోత్సాహము లేకుండెను. రాజుల యాస్థానములలోఁ దమ కాలమును గడపుచుండిన కవిరాజులకు సామాన్యజనులతో విశేషపరిచితి గాని, వారి భావములను ఆదర్శములను పరిశీలించుటకుఁ దగిన యవకాశము గాని యున్నట్లు కనఁబడదు. మఱియు సామాన్యజనులలో విద్యావ్యాప్తి శూన్యప్రాయం బగుటంజేసి యిట్టి పరస్పర సంబంధమునకు వీలుదొరకి యుండదు. కావున, అప్పటి రాజులును వారిమంత్రులును సామాన్యముగ యశోలుబ్ధు లగుటచే, కవిరాజుల సంకీర్తనంబున తమ పేరు శాశ్వతంబుగ నుండునని తలఁచి వారివలనఁ గృతులు గొనుచుండిరి. కవులును తమ్మాదరించువారు లేక వారి ప్రాపున చేరి వారి గుణములు సంకీర్తనము చేయుచు, కథాభాగమున కేపురాణముచుండియో యొక విషయమును దీసి దానియందే తమ చాతుర్యంబును వెలయింపఁ జూచిరి. కావున, వీరి గ్రంథములలో సాధారణముగా మనకు దినచర్యయందుఁ గనఁబడెడి

మానవజీవితంబును మనోవృత్తులను భావంబులను గనఁబఱు పక పూర్వయుగములఁ బ్రసిద్ధిచెందిన కించిదతిమానుషప్రభావము గలవారి చర్యలను, వారి యాకారములను మనయెదుట నిల్పి, మన కున్న తాదాత్మ్యములను బోధించుచుండిరి. వాఙ్మయము యొక్క ముఖ్యప్రయోజనము మానవజీవిత ప్రతిపాదనము గాని నైతికమార్గప్రతిపాదనము మాత్రమే కాదు. ప్రతిభావంతుఁడొకఁడు మానవజీవితమును బాగుగఁ బరిశీలించి, ఆయా జనుల యవస్థలను ఆయా స్థితులవారి భావములను ఒక్కొక్క విషయమున వారి కనుభవసిద్ధము లయ్యును బయటికి వెల్వడ సమర్థములు గాని మనోవృత్తులను బాగుగ కనిపట్టి చక్కని సందర్భములను గల్పించి చిత్రించియున్నచో, అవి వారి మనమును తత్క్షణమే యాకర్షించుటకు సంశయం బేమి? ఒక పుస్తకము చేపట్టినంతనే, అది పాఠకునకు స్వానుభవము లగువిషయములనేకములు పొడకట్టుటయే గాక, తనవలెనే కష్టసుఖములకుఁ బాల్పడినవారి జీవితములను గుఱించిన యభిప్రాయములను వాని కది వెలిపఱచుచుండును. అట్టివాని స్థితికై సానుభూతి గనఁబఱచు ననేకు లగుసాటి జను లా గ్రంథమునఁ గనఁబడుట చేతనే, వాని కొక రీతి యానందమును తాపోపశమనంబును మనశ్శాంతియుఁ గల్గుచుండును. కావుననే జార్జి ఎలియట్ అను నామె 'వాఙ్మయ మనునది మన యనుభవజ్ఞానమును వృద్ధి చేసికొనుటకును సామాన్యముగా మనము కలిసికొనుటకు వీలులేని పలువురు సజాతీయులతోడి సంబంధము కలుగఁజేసికొనుటకును ముఖ్యమార్గ' మని చెప్పి యున్నది. ఇట్లు సార్వజనీనంబులు సహజంబులునగు జాతీయభావములను మనోవృత్తులను బ్రతి

పాదించున దగుటంజేసియే వాఙ్మయమునకు మానవకోటి కంత యభిమానమును గౌరవమును గలుగుచున్నది.

కాని, మన యాంధ్రికవులీ విషయము నంతగా పాటించి నట్లు కనఁబడదు. ముఖ్యముగ ప్రబంధ మనునది చాలవఱకు వర్ణనాత్మకమగు కవితలోఁ జేరినదేగాని భావావబోధమే ముఖ్య విషయముగఁ గలది కాదు. మఱియు నలంకారశాస్త్రనిబంధన లీ గ్రంథములను నైజకవితకు మరింత దూరముగఁ జేసినవేమో. సాధారణముగా నిటీవలి ప్రబంధములలో కథాసరళియు రచనాప్రణాళికయు సమానమే యగుటచే కథ మొదలు చెప్పినచో తుదవఱకు నూహించి చెప్పుట సుసాధ్య మగుచుండును. ఆలంకారికమత ప్రకారముగ నష్టాదశవర్ణనలు లేనిది కావ్యంబు గాకుండుటచే నెట్లయిన నా వర్ణనలను కథలోఁ బ్రవేశపెట్టి యాగ్రంథమును కావ్య మనిపించుట తటస్థించుచున్నట్లున్నది మఱియు నాయకుఁడు ధీరోదాత్తుఁడయి యుండవలెననియు, అట్టివాని కీర్తిగుణంబు లుండవలెననియు ముందుగనే పేర్కొని యుంచుటచే నీ గ్రంథకర్తల కేమాత్రమును గ్రంథమందలి పాత్రలను స్వానుభవమునుండి యథేచ్ఛముగ నిరూపించుట కుత్సాహము లేకుండెను; తమ గ్రంథము శాస్త్రసమ్మతమగు ప్రబంధమో నాటకమో కాకపోవు నేమో యని యీ నిబంధనల నతిక్రమింప నొల్లకుండుటవలన, వారి గ్రంథముల నట్టాడు పాత్ర లచ్చున పోతపోసినవానివలె నుండుటయేకాని నేలమీఁద స్వేచ్ఛావిహారము సల్పుచు తమ తమ మనోవృత్తులను మనకు విచ్చలవిడిగ వెలిపుచ్చుచున్న వారివలె గనుపట్టరు. తొలియుగమున తిక్కనాదు లట్టి పాత్రలను

సృష్టింపక పోలేదు. కాని సామాన్యముగా కవులాయా కాలము లందలి మానవజీవితమును బరిశీలించి సందర్భానుసారముగఁ బాత్రలను సృష్టింపక యేపురాణము నుండియో యొక ప్రఖ్యాతపురుషుని దీసికొని వాని ప్రసిద్ధంబు లగు గుణము లను వర్ణించుటచే నీగ్రంథములను సులభముగ శాస్త్రసమ్మతము లైనవానిఁగఁ జేయఁగలుగుచుండిరి. వీరి కీ యాలంకారిక సమ్మతంబు లగు నుత్తమ పాత్రలు పూర్వ పురాణగాలథ యందుఁ గన్పట్టినే కాని, తాత్కాలిక దేశచరిత్రయం దెప్పు డును గన్పట్టలేదు. దీనికి కారణమాంధ్రజనుల కెప్పుడు నాయా రాజుల ప్రాపున సుఖ జీవనము పడయుట యుండే కాని సాంఘిక జీవనమునందును, దేశచరిత్రయందును విశేషాభిమానము లేకుం డుటయే కావచ్చును. జనుల మనముల నొక విధమగు స్వాతం త్ర్యాభిలాషయు నాత్మ గౌరవమును నుదయించినఁగాని సంఘో ద్యమములందు రుచియు, వానియం దభిమానమును పుట్టవు. సంఘోద్యమములును దేశోద్యమములును కవిజన మనంబుల కుద్దీపకములు. కవితకే కాదు, తదితర మానవశక్తుల కన్నిటికి నభ్యుదయవికాసము లుత్తేజకములే. అట్టి కాలముననే కవితయు నూతనమై స్వాభావికమై వికాసవంతమై వెలుఁగొందుట; కాని నాఁడు తాపత్రయ సంతాపితంబు లగు నా కవిజన మనంబుల వోలె వికాసవిహీనమై యేవో కొన్నికట్టుపాట్లకు లోనై గతా నుగతికంబుగ నుండును. కావున కొంతవఱ కాంధ్ర వాఙ్మయ స్థితి యా జనుల స్థితిగతులను గూడఁ దెల్పుచున్న దనుటలో సంశయము లేదు.

కాని యిప్పుడు హిందూదేశచరిత్రయం దొక నూతన

యుగము ప్రారంభమైనది. ఇప్పటికి 150 సంవత్సరముల క్రిందటనే బ్రిటిషుసామ్రాజ్య మీ దేశమున శాంతిని నెలకొల్పినను, ఈశాంతియొక్కయు నాంగ్లదేశీయుల సంసర్గముయొక్కయు, నాంగ్ల వాఙ్మయ పఠనముయొక్కయు ఫలితము లిప్పుడే కొంచెము గన్పట్టుచున్నవి. ఈ సామ్రాజ్యావలంబనమున నింతకాలము నుండియు నివురు గప్పిన నిప్పువలె నున్న ప్రాచీన హైందవ విజ్ఞాన మిప్పుడు స్వాభావిక తేజంబునఁ బ్రకాశించుచున్నది. తద్దేశచరిత్రము చదివినతోడనే యీదేశజనులకు జాతీయ జీవనమునం దభిలాష యుదయించినది. ఆత్మగౌరవము వ్యక్తిస్వాతంత్ర్యము మొదలగు నుదారభావము లంకురించినవి. దేశాభిమానమును భాషాభిమానమును హెచ్చినవి. దేశజనుల మనంబు లుత్సాహపూరితంబులై యున్నతాదర్శంబులతోఁ దులదూఁగుచున్నవి. దేశసేవయు భాషాసేవయు ప్రతివానికిని ముఖ్యవిధులని యంగీకరింపఁబడుచున్నవి. ఇట్టి నూతనాదర్శంబులు నూతనోద్యమంబులు వాఙ్మయమునఁ బ్రతిఫలింపకపోలేదు. సంస్కృతవాఙ్మయ మంతయు తీక్ష్ణబుద్ధితోఁ బరిశీలింపఁబడుచున్నది. ఈ భాషయే యాధునిక శబ్దశాస్త్రసమస్యల ననేకములను సాధించుటకుఁ దోడ్పడి యాశాస్త్రము నభివృద్ధి చేసిన పాశ్చాత్యుల గొప్ప మన్ననలకుఁ బాత్రమైనది. ప్రాచీన హైందవ నాగరకత యంతయు వట్టి సమ్మందగని పురాణగాథ క్రింద త్రోసివేయఁబడక, నవీనవిమర్శన పద్ధతుల ధాటి కాఁగి లోకజనుల నాశ్చర్య నిమగ్నులఁ జేయుచున్నది. ప్రస్తుతము వెనుకఁబడి యున్న హైందవజాతి పురోవృద్ధికి ప్రాచీన నాగరకతయే మూలాధారమగు నని గుర్తించుటచే, దానిని పునరు

జ్జీవింపఁ జేయుటకు సాధ్యమగు ప్రయత్నము లన్నియు చేయఁ బడుచున్నవి. రవీంద్రనాథుఁడు మొదలగు కవీశ్వరు లీ నూతనోద్యమముల యాదర్శములఁ గొనియాడుచు నీ జాతియందలి నూతనోద్బోధమునకుఁ దగిన ప్రోత్సాహము నిచ్చుచున్నారు. ఆంగ్లవాఙ్మయ సంసర్గమువలనఁ గవితయందలి పూర్వపు రుచి మాఱినది. దేశభాషావాఙ్మయము లన్నిటిలోవలెనే యాంధ్రవాఙ్మయమునను నూతనశాఖలు బయలుదేఱినవి. సంస్కృతవాఙ్మయాశ్రయమును వదలి యాంధ్రదేశస్థితిని జాతితత్త్వమును వెల్లడింపగల రచనలు, నవలలు, నాటకములు, విమర్శనములు, ఖండకావ్యములు మొదలగునవి బయలుదేరుచున్నవి. ఈ జాతీయోద్బోధముయొక్క చిన్నెలు క్రమముగ కవితయందును బ్రసరించుచున్నవి. పురాణకథలకు బదులుగా నాత్మానుభవనివేదనమే కవితకు వస్తువు కాఁ జొచ్చినది. అనేక సంఘములు పరిషత్తులు బయలుదేఱి భాషను వాఙ్మయమును వృద్ధిపఱచువిధానముల నారయుచున్నవి. ఇప్పటి కాంధ్రకవిత కాశ్రయాపేక్ష తప్పినదని చెప్పవచ్చును. క్రమముగ దేశమున విద్యావ్యాప్తి హెచ్చుచుండుటచే కవితయొక్క గుణాగుణములు నిర్ణయించి తగు ప్రోత్సాహము నిచ్చుట కాంధ్రజనసమితియే పూనుకొనుచున్నది. ఇట్లు జాతీయ జీవనముతో పాటు వాఙ్మయమును భిన్నావస్థలఁబొందుచుండుటనుగనిపట్టి, ఇప్పుడు వ్యక్తములై క్రమముగ స్ఫుటము లగుచున్న యీ నూతనయుగచిహ్నములను ధర్మములను కవితయందు నెలకొల్పి దేశ జనుల కుత్సాహమును నుద్రేకమును పుట్టించి, ఈజాతీయోద్యమమునకుఁ దోడ్పడి దేశీయ కవిశిఖామణులందఱును శాశ్వతకీర్తిని బడయుదురుగాక !

## విమర్శనపద్ధతులు

ఆంధ్రభాషయందు కృతివిమర్శనము నెట్లు చేయవలయునో తెలుపు గ్రంథము లతిస్వల్పముగా నున్నవి. అవియుఁ బూర్వకవికృతములు; సంస్కృతమునుండి భాషాంతరీకృతములు. అవి ప్రబంధము లెట్లుండవలయునో శయ్య లెన్ని విధములో నాయకు లెన్ని తెఱఁగతులవారో, ఈ మొదలగు విషయము లనుగూర్చి చెప్పును. అంతే కాని, వానిఁ జదువుటవలన ప్రతి వాఁడును 'ఈగ్రంథము బాగుగనున్నది. ఈగ్రంథము బాగుగ లే'దని చెప్పఁజాలఁడు. వానివలన నొక గ్రంథము పూర్వాలాక్షణికుల నియమముల నన్నిటి ననుసరించి వ్రాయఁబడియున్నదో లేదో మాత్రము తెలియును. అంతేకాని రసవంత మయిన కవిత్వ మన నేదియో కవిత్వమున కుండవలసిన లక్షణము లేవియో అవి తెలుపఁజాలవు. ఉన్నతభావములు మాత్రమే కవితకు సరిపడియుండును. ఏదియు ఛందోబద్ధ మయినంత మాత్రమున కవన మనఁబడదు, "ఈ రెంటికిని గల భేద మేమి? ఈ భేద మెట్లు గుర్తింపవచ్చును?" అను విషయమును విచారించుగ్రంథము లేవియు లేవు. తెనుఁగున కవిజీవిత గ్రంథములు ప్రబలకుండుటకు కారణము మన పూర్వకవుల జీవితమును గుఱించి తెలియక పోవుటే కాదు, అట్టి దృష్టియే మనవారికి లేకపోవుటయును. ఇందులకు ముఖ్యకారణము కృతివిమర్శన మెట్లు చేయవలయునో తెలుపుగ్రంథములు లేకపోవుటయే యనియుఁ జెప్పవచ్చును. ఏదైన గ్రంథమును చదివి 'ఇది బాగు

న్నది, అది బాగుగ లేదని యనుటయేనా కృతి విమర్శనము చేయుట? లేక ఇంకనేమైన కలదా? "ఇది యెందుకు బాగున్నది? ఎందుకు బాగు లే" దను ప్రశ్నలకు నుత్తర మీ పూర్వలాక్షణిక గ్రంథములను చదువుటవలనఁ దెలిసికొనుట దుర్ఘటము. కనుక నీవ్యాసమున కావ్య మన నేమియో కావ్యవిమర్శన మెట్లు చేయవలయునో సూచించుట కొకింత ప్రయత్నము చేయఁబడును. కావ్యము కృతి యను పదములను రెండింటిని వాఙ్మయభాగమునకై యుపయోగించుచున్నాము. కావున నీపదములవలన మనవారు కావ్య మని యెంచు కొన్ని గద్య పద్యాత్మకములగు గ్రంథములే కాక గద్యరూపములైనట్టియు నాటకరూపము లైనట్టియు గ్రంథములును, కావ్యలక్షణములను, పొందియుండని శతకములు, దండకములు, పదములు, పాటలు, యక్షగానములు మొదలగునన్నిటిని గ్రహింపవలయును. ఈ గ్రంథములయందు వేనిని రచించినను వానిని కవి యన వలయు ననుట స్పష్టమగుచున్నది.

విమర్శనమనఁగా నేర్పుతో చేయఁబడిన యొక పనియొక్క తత్త్వమును దెలిసికొని దాని గుణాగుణములను బరిశీలించి తగు నభిప్రాయమును కలుగఁజేసికొని యానందించుట యని చెప్ప వచ్చును. కావున కృతివిమర్శన మనఁగా నొక కృతిని గుఱించి యిట్టియభిప్రాయమును కలుగఁజేసికొనుటయే 'రుచి'. 'అభిరుచి' యను పదములు విమర్శనలనుగూర్చిన వాదములలో సామాన్యముగ నుపయోగింపఁబడుటచే వీని యర్థమును మనము బాగుగఁ దెలిసికొనవలసియుండును. ఈ పదములు నిపుణతతోఁ జేయఁబడిన యేదేనొక పనియొక్క విశేషమును గ్రహించు

టకుఁ గావలన సామర్థ్యమును తెలుపుటకై యుపయోగింపఁ బడును. ఇట్టి విశేషములను గ్రహించుపట్ల మన బుద్ధియొక్క టియే కాక భావములుకూడ పనిచేయవలయును. ఇట్టి శక్తినే రసజ్ఞత యందురు. దీనివలన విమర్శనముయొక్క ముఖ్యోద్దేశ మొక కావ్యముయొక్క రసమును గ్రహించుటే కాని దాని యాధిక్యమును గుఱించి నిర్ణయించుట కాదని తేలుచున్నది. కావ్యము లందలి గుణమునుబట్టి దేనివెనుక నేది వచ్చునో ఏ కవిని ముందుంచవలయునో ఏ కవిని తరువాత నుంచవల యునో యను సంశయము కావ్యవిమర్శకుని ముఖ్యోద్దేశము కాదు. అట్టి సూక్ష్మభేదములు నిర్ణయింపఁజాలము. ఒకవేళ నిర్ణ యింపఁగలిగినను అది సర్వజనాదరణీయమై యుండదు. గొప్ప కవుల కందఱకును స్వతంత్రములై యనన్యసామాన్యము లగు గొప్పలక్షణములు కొన్ని యుండును. ఈ లక్షణము లనేక విధ ములై యుండుటచే వీనియందు తరతమ భేదములను కల్పించు టకుఁ దగిన యవకాశములు లేవు. ఇట్లు శ్రీనాథుఁడా లేక పోతనా, పింగళిసూరనా లేక రామరాజభూషణుఁడా గొప్ప కవియని యడిగినయెడల నిద్దఱును గొప్ప కవులని చెప్పుటయే దీనికి సరియైన యుత్తరము. పోతన కవిత్వమునందలి గొప్ప లక్షణములు కొన్ని శ్రీనాథుని కవిత్వమున లేవు. ఇట్లే శ్రీనా థుని కవిత్వమునందలి గొప్ప లక్షణములు కొన్ని పోతన కవన మందు లేవు. కావున వీరి నిద్దఱిని సరిపోల్చుటకు సమానమగు నాధార మేమియు లేదు. కాని, మనుచరిత్ర గొప్పదియా లేక కవిజనచకోరచంద్రోదయము గొప్పదియా యని యడిగినచో కొంచెము సులభముగను స్పష్టముగను చెప్పవచ్చును.

ఈ రెంటికిని గలభేదము చేర్పఱచుటకు ముఖ్యమగు సమానమైన యాధారము కలదు. మఱియు నొకొక్కనికి కొన్నికొన్ని లక్షణములు గొప్పవిగఁ గనఁబడుచుండును. కనుకనే, కావ్య విమర్శనమున కవితయందు గొప్పతనమును సూచించు లక్షణము లేవియో, ఏ కవి వీనియందే లక్షణములు గలిగియున్న వాఁడో తెలుపుటచే, మన మాకవిని బాగుగ గ్రహింపఁగలుగు చున్నాము. దీనిని బట్టి కావ్య విమర్శన మనగా, ఏదైన నొక కావ్యముయొక్క యుత్కృష్టతను తగు విధమున గ్రహించుటకుఁ గావలసిన విధానములనే కాక, అట్టి కార్యమునకుఁ దోడుపడు విషయములను, అట్టి యభిజ్ఞతను వృద్ధిపఱచు సంగతులను గూడ పరిశీలించుట యని తెలుపుచున్నది. కావ్య పఠనమునకు మూఁడు మార్గములుకలవు. వానియందు మూఁడవ దానితో మాత్రమే కావ్యవిమర్శన మావశ్యకతను గలుగఁ జేసికొనుచున్నది.

(క) మొదటి మార్గము చారిత్రకవిమర్శనము. ప్రతి జాతియొక్క వాఙ్మయము నాయా జాతిజీవితమునందు కలుగుచుండు మార్పులను దెలియఁజేయుచుండును. వాఙ్మయము చరిత్రయొక్క ముఖ్యభాగమై యున్నది. ఒక జాతియొక్క చరిత్ర వారి వాఙ్మయమునందలి ముఖ్యగ్రంథములనయినను జదువకయే తెలియదు. ఇట్లాంధ్రుల చరిత్రను వ్రాయునతఁడాంధ్రులలో ఘనత నొందిన కవులచే రచింపఁబడిన గ్రంథములను చదువకుండినను, మహారాష్ట్రుల చరిత్ర వ్రాయునతఁడు తద్వాఙ్మయమునందలి ప్రసిద్ధగ్రంథములను చదువకుండినను అంత సంపూర్ణమైన చరిత్రను వ్రాయఁజాలఁ డని

చెప్పవచ్చును. ఒక దేశమునం దొక్కొక్క కాలమున సంభవించెడి రాజకీయ సాంఘిక విప్లవములవలన నా దేశచరిత్రయందును ఆ జాతీయ జీవితమునందును గలుగుచుండెడి మార్పుల నాయాకాలపు కవిత కొంతవఱ కైనను సూచింపక మానదు. ఇట్లు కృష్ణదేవరాయల కాలమునం దాంధ్రుల జీవిత చరితమునఁ గలిగిన మార్పులను చాలవఱ కా కాలమునాఁటి కవితయందు చూడ నగును. గుంటూరుమండలములోని రెడ్లకాలమునాఁటి యాంధ్రుల చరిత్రమునందలి మార్పులను 'పల్నాటి వీరచరితము' మొదలగువానియందుఁ జూడనగును. ఫ్రెంచివా రిండియా దేశమునకు వర్తకనిమిత్తమై వచ్చి భూములను సంపాదించి రాజ్యమును సంపాదించుటకై చేసిన ప్రయత్నములును, అందువలన నాంధ్రుల చరిత్రమునఁ గలిగిన మార్పులను రంగరాయచరిత్రము మొదలగువానియందు చూడఁదగును. మహమ్మదీయ ప్రభుత్వమువలన నాంధ్రదేశమునఁ గలిగిన మార్పు లనేక శతకములయందు కానఁబడుచున్నవి. ఈ విధముగనే యాంగ్లేయరాజ్యాధిపత్యమున నాంధ్రదేశమున నెట్టి నూతనోద్యమములు ప్రబలినవో, ఇంకను కలుగుచున్నవో యీ కాలమున బయలువెడలు గ్రంథములను బరిశీలించినచో సులభముగఁ దెలిసికొనఁగలుగుదుము. కావున దేశచరిత్రయందుఁ గలుగుచుండెడి మార్పులను, వానివలనఁ గలిగెడి జనుల యాశయములయందలి మార్పులను గొంతవఱకు తెలిసికొనినే, ఒక్కొక్క కాలమున నొక్కొక్క విధమైన గ్రంథములు ప్రబలుటకును, వానియం దొక్కొక్క విధమైన నూతన విషయములు వర్ణింపఁబడుటకును గలకారణముల

మనము గ్రహింపఁగలము. బొబ్బిలిపాటను మనము బాగుగ గ్రహించుటకు బొబ్బిలియుద్ధమునుగూర్చి మనకుఁ గొంత తెలియవలయును. రైలుబండిపాట మన కిప్పుడంత మనోహరముగ నుండకపోయినను అది ప్రథమమున దేశమందు రైలు వేయఁబడినప్పుడు దేశీయుల మనంబు లప్పు డెట్టి యద్భుతాశ్చర్యములతో నిండియుండినవో యిప్పటికిని మనకుఁ దెలియఁజేయుచున్నది. భారతయుద్ధము జరిగిన కాలమున దేశస్థితి యెట్లుండెనో జనుల యాచారము లెట్లుండెనో కొంతవఱకు మనకుఁ దెలిసి యుండినఁగాని అందలి విషయములు కొన్ని మనకు బాగుగ బోధపడవు. ఆకాలమందు కొన్ని తెగలలో బహుపతికత్వ మొక యాచారమై పరిగణింపఁబడుచుండెనని తెలిసికొనిననే, ఒక స్త్రీ కేవురు పతులగుట యెట్లు తటస్థించెనో మనము గ్రహింపఁగలము. లేదా 'కవి యేమి యిట్లు వ్రాసె ?' నని యాలోచనలో మునుఁగవలసివచ్చును; లేక 'యిది యొక పురాణగాథ, దీనికి తల యేమి తోఁక యేమి ?' యని త్రోసిపుచ్చవలసివచ్చును. మఱియొకటి చంద్రరేఖావిలాపమును చదివినయెడల హాస్యరసప్రధాన మగు కావ్యమువలె మాత్రము కనఁబడును. కాని, అందలి ప్రతిపద్యముయొక్క నిశ్చయార్థమును, ఆ కాలమునాటి కవులయొక్కయు రాజులయొక్కయు దురాచారములను మనము పూర్తిగ తెలిసికొనినంతనే, మనకు గోచరం బగును. కావున, కవితావిమర్శనము చేయువానికి దేశకాలస్థితులతోఁ గొంతయైనను పరిచయ ముండవలెను. ఇట్టి జ్ఞానము లేకున్నచో నాయాకవుల రచనలతత్త్వమును మనము గ్రహింపఁజాలము. ఇట్లు మనపూర్వకవులచే రచింపఁబడిన కావ్య

ములయందు శృంగారరస మత్యధికముగఁ గలదని వారిని నిందించెదము. అట్టిసంగతిని తెలిసికొనలేకపోవుట వారిలోపము కాదు. ఆ కాలమం దదియాచారమై యున్నది. తిక్కన కూడ నాకాలమున నుండినయెడల ఆ విధముగనే శృంగారవర్ణనలు చేసియుండు నని చెప్పవచ్చును. కొందఱు తమ కాలమందు ప్రబలిన యాచారముల నామోదింతురు. మఱికొంద ఱామోదింపక తమ స్వాతంత్ర్యమును చూపుదురు కావున, మనము విమర్శించునపుడు వారికి కొంతయవకాశ మిచ్చి వారి యభిప్రాయములయెడ నాదరము చూపుచు సానుభూతితోఁ జర్చింప వలసియుండును.

ఇంతేకాక యొక్కొక కాలమునందుఁ బ్రబలిన యాచారములు భావములును వాఙ్మయముయొక్క విధములను నిర్ణయించుచుండును. జాతీయజీవనమునఁ గలుగుచుండు మార్పుల కనుగుణముగ నొక్కొకప్పుడు కవితయందలి రుచియు మాఱుచుండును గావున, ఒక్కొక కాలమున నొక్కొక విధమైన కావ్యములు ప్రాముఖ్యములోనికి వచ్చుచుండును. ఇట్లాంధ్రవాఙ్మయమున ప్రథమయుగము భాషాంతరీకరణయుగమైయుండినది. నన్నయకుఁబూర్వము చాలకాలమునుండి దేశమందు సంస్కృత భాషయు సంస్కృతవాఙ్మయమును బాగుగ వ్యాపించియుండెను. సంస్కృతభాషయందే భారతీయ వైదికవిజ్ఞానమంతయుఁ గ్రోడీకరింపఁబడియుండుట తటస్థించుటచే, దేశికవిత కొంత వృద్ధిలోనికి వచ్చిన పిదప కూడ నదివఱలో దేశీయుల యాదరమును బడసినట్టియు, అనేకవిధముల విశేషాంశములతోఁ గూడికొని యున్నట్టియు సంస్కృత భాషాగ్రంథములను

వైదిక మతోద్ధరణమునకై భాషాంతరీకరించుట యావశ్యకర్తవ్యమై కనబడెను. అనంతర మనుసరణములు, స్వతంత్ర గ్రంథములు బయలువెడలుట తటస్థించెను. ఇట్లు నన్నయ తిక్కనాదుల కాలమున పురాణములు భాషాంతరీకరింపబడియెను. కృష్ణరాయల కాలమున ప్రబంధములు వృద్ధిలోనికి వచ్చినవి. తరువాత ద్వ్యర్థికావ్యములు బయలు దేఱినవి. తెనుఁగున మొదటినుండియు ద్వ్యర్థికావ్యములుండెననియు, అందు వేములవాడ భీమకవి కృతమైన ప్రథమగ్రంథము నశించె ననియు కొందఱు చెప్పెదరు. అవి యన్నియు నశించు టొక వింత. ఒకవేళ నశించినను భీమకవి రచించిన ద్వ్యర్థికావ్యము తరువాత నట్టి గ్రంథములు చాల కాలమువఱకు నితరులచే రచియింపఁబడకుండుట మఱియొక వింత. కావున నీ సంగతి యాదరణీయము కాదు. ఆంధ్ర వాఙ్మయమునందలి యవస్థలను సూక్ష్మబుద్ధితోఁ బరిశీలించినచో నందు మొదట నెవ్వఁడేని యొకదారిఁ దీసినచో మఱియొక తెఱఁగెఱుఁగువఱకును మన కవు లా దారినే పట్టి పోవువా రను విషయము మనకు తట్టకపోదు. కావున, భీమకవి తరువాత రామరాజభూషణుని వఱకు నితరులు ద్వ్యర్థికావ్యరచనకే పూనుకొనకుండుట చూడ, భీమకవియే యట్టి కావ్యమును రచించి యుండలేదని యూహింపఁదగి యున్నది. కాని, రామరాజభూషణుని తరువాతనే యితరు లారచనకుం గడఁగుటయు, అట్టికావ్యములను రచించుట యొక గొప్పతనముగ పరిగణింప బడుటయుఁ దటస్థించినది. రామరాజభూషణుఁడు మాత్రమే ద్వ్యర్థికావ్యరచన కేల పూనుకొన

వలెనో యిచ్చట కొంచెము విచారింపవలసి యున్నది. పెద్ద నార్యుఁడు మనుచరిత్ర వ్రాసినంతనే వానితో నించుమించు సమకాలికుఁడగు రామరాజభూషణుఁడును సమర్థుఁడగుట వలన నంతకంటె నుత్కృష్టమగు గ్రంథము నా శక్తినే రచియించి నంతకంటె రాజమన్ననలఁ బడయవలయు నని తలంచి యుండును. అంతకు ముందు ధ్వని ప్రధానంబగు కావ్య మున్నతపదవినందు నను వాడుక కలదుగదా? ఇట్టిది యాలంకారిక మతమునఁ గూడ శ్రేష్ఠమని యెన్నఁబడుచున్నది. భారతమున తిక్కన కూడ ధ్వనిని చూప నెన్నియో ప్రయత్నములు జయప్రదముగఁ జేసెను. కావున తానుకూడ వసుచరిత్రమునందీ ధ్వనినే ప్రధానముగాఁ జేసినచో తన కోర్కె ఫలింపవచ్చు నని యూహించి యా 'కావ్య జీవిత మును' తన ప్రబంధమున చిమ్మి పైచెను. ఈవిధముగ వసుచరిత్ర రచనయందు ధ్వనిని కావ్యాంగములలో నంత ప్రధానముగ ప్రదర్శించిన రామరాజభూషణుఁడు వసుచరిత్ర రచించిన పిదప, తనచే నూతనముగ సంపాదింపఁబడిన యపూర్వ సామర్థ్యమును వినియోగించుటకును దనపాండిత్యమును బ్రదర్శించుటకును దగిన తెఱవు ద్వ్యర్థికావ్యమును రచించుటే యని నిశ్చయముగ దలంచెను. ఇఁక రామరాజభూషణకృత మగు ద్వ్యర్థికావ్య మును లక్ష్యముగ చేసికొని ఇతరు లా విధమున ద్వ్యర్థి కావ్యములను త్ర్యర్థికావ్యములను గూడ రచింప మొదలు పెట్టిరి. ఈద్వ్యర్థికావ్యములు రామరాజభూషణుని కాలము ననే యేల వాడుకలోనికి వచ్చిన వని విచారింతిమేని, యది కవులు తమపాండిత్యప్రకర్షను జాటుకొన నుత్సహించినకాల మగుటయే కారణమని మనము గ్రహింతుము.

మఱియు నొకానొక కాలమున సంస్కృతపదభూయిష్ఠము లగు పద్యములు జనుల కాహ్లాదమును కలిగించు చుండును. తనకవిత్వము 'నిజము కర్ణాటభాష' యని చెప్పుకొన్నను, శ్రీనాథుని కవిత్వమునందు సంస్కృత పదము లధికములే. ఈతని కాలమువారి కవిత్వమునం దంతటను ఈ విషయము చూడనగును. కాని, కూచిమంచి తిమ్మకవి తన గ్రంథముల నెక్కుడుగా నచ్చ తెనుఁగు పదములు వాడెను. ఆ కాలమునం దచ్చ తెనుఁగు పదములను బ్రయోగించు వాడుక విశేషముగఁ బ్రబలియుండెను. కావుననే అడిదము రామకవి 'శుద్ధాంధ్రకవి' నని చెప్పికొనియున్నాఁడు. మఱియు ప్రస్తుతము సులభశైలిలో వ్రాయఁబడిన వచనకావ్యము లాదరణీయములై వృద్ధిలోనికి వచ్చుచున్నవి. ఇట్లీపైఁ దెలిపిన సంగతులను బట్టి యొక కాలమందు కావ్యరచన యెట్లుండెనో కవిత్వమం దెట్టి లక్షణములు జనుల కిష్టములై యుండెనో ఆయా లక్షణములు గల కవిత లాయా కాలములలో ప్రబలియుండుటకును అప్పటి జనుల యాదరము వడయుటకును గల కారణము లేవై యుండునో ఆయా కాలమునందలి జాతీయజీవనమీ కవితా ప్రసారము నేయే విధముల మార్పుఁ గలిగునో ఈ మొదలగు విషయములు చారిత్రక విమర్శనమువలన తెలియనగును. కావుననే యొక కాలమందు ఘనులుగా నెంచఁబడిన కవులు మఱియొక కాలమున నన్నించబడకుండుటయు, ఒక కాలమున జనుల యాదరమె వడయని కవులు మఱియొక కాలమున మహాకవులుగ నెంచబడుటయు సంభవించుచుండును. ఈ విషయములు కొంతవఱకు మనకావ్యములయందలి కృతినిర్మాణ

ప్రస్తావమున చూడనగును. అందలి పద్యములనుబట్టి యొక్కొక్క కవి కవితయం దేయే లక్షణములు గొప్పవని యెంచెనో, ఏయే లక్షణములను నిరసించెనో, మనకుఁ దెలియుటే కాక, ఆయా కాలములయందు కవుల యభిప్రాయము లెట్టుండెనోకూడ తెలియును. పింగళి సూరనార్యుని రచన లాతని కవితాలక్షణ విమర్శనమునకు దగియే యుండుట సుప్రసిద్ధమేగదా.

ఇట్లు జాతీయధర్మములు వాఙ్మయమునఁ బ్రతిబింబితములై యుండు ననియు నా జాతీయజీవనమునఁ గలుగుచుండెడి మార్పులు కవితాధోరణినికూడ మార్చుచుండుననియు నీ మొదలగు విషయములు చారిత్రకవిమర్శనమువలనఁ దెలియును. కాని ప్రతిమనుజుఁడు నింకొక మనుజుని కొంతవఱకు పోలియున్నను వానికంటె భిన్నములగు లక్షణములు కొన్ని నియతముగఁ గలిగియుండునట్లే, ఒక్కొక్క కాలమున నొకవిధమగు కవిత ప్రబలినను ఆ కాలమందలి ప్రతి కవియందును ఇతర కవులయందుఁ గానరాని కొన్ని స్వతంత్రలక్షణములునుండును. కాని చారిత్రకవిమర్శన మీస్వతంత్ర లక్షణములను గణనచేయదు. ఇట్టి విమర్శన మాయాకాలములలోఁ గొన్ని కొన్ని సామాన్యలక్షణములు చూడఁదగు నని సమాధానము చెప్పునే కాని, ఆయా లక్షణములయం దేవి యుత్తమ కవితకుఁ జెందునవియో, ఏవి చెందనివియో నిర్ణయింపకపోవుటచే కావ్యానందానుభవమునకు ముఖ్యమైన యభిరుచిని తృప్తిపఱుపఁజాలదు. కావున కావ్యవిమర్శనము చారిత్రకవిమర్శనముకన్న భిన్నమై వెలయుచున్నది. ఇట్లనుటచే చారిత్రకవిమర్శం యొక్క యావశ్యకత తగ్గుటలేదు. ఏల యన, కావ్యవిమర్శన

విధానములను పూర్తిగాఁ జర్చించునపు డా యాకాలకవులయం
దలి కవితారీతులతో నొక్కొక్క కాలమందలి వైఖరులను బోల్చి
చూచుచుండుట యావశ్యకమగుచుండును గదా ?

(చ) ఇఁక రెండవవిధమైన విమర్శనమును గూర్చి విచా
రింతము. ఇది కవిజీవితముతో సంబంధించి యుండును. ఏదియైన
నిపుణముగాఁ జేయఁబడిన పనిని చూచితిమేని ఆ పనివానినిగూర్చి
కొంత తెలిసికొనఁ గోరెదము. అట్లే యొక కావ్యము రసవంతమై
యుండినయెడల నాకవినిగూర్చి కొంత వినఁగోరెదము. ఒక కవి
యెఱ్ఱనివాఁడో నల్లనివాఁడో పెద్ద వయసున కవనముచేయ
నారంభించెనో చిన్నతనమునందే యారంభించెనో ఈవిషయ
ములు మనకుఁ దెలియకపోయినను, అతని కావ్యము చదివి దాని
యందలి మంచిచెడ్డల నారయుటకు వీలు లేకపోలేదు. అయినను
ప్రతిమనుజునియందును గొన్ని స్వతంత్రలక్షణము లెట్లుండునో
అట్లే ప్రతికవియందును కొన్ని లక్షణములు మిగిలిన కవులనుండి
అతనిని వేఱుపఱచుచుండును. కావున నా కవి యొక్క భావ
ములు సంప్రదాయములు మనకు బాగుగఁ దెలిసిన యెడల
నాతని కవనమును మనము బాగుగ గ్రహింపఁగలము. కవి
గ్రంథములను, అందలి విశేషాంశములను పూర్తిగ గ్రహింప
వలయునన్నచో ఆ కవిజీవితము మనకుఁ గొంతసాయపడగలదు.
మన పూర్వకవుల జీవితములనుగుఱించి మనకు బాగుగఁ దెలి
యకపోవుటచేత గ్రంథస్థవిషయములను బట్టియే వారి జీవిత
చరితమును గొంతవఱకైనను దెలిసికొనవలసి వచ్చుచున్నది.

(ట) ఇక మూఁడవరీతి విమర్శనమును కవితావిమర్శన
మని, కాని, కవిత్వతత్త్వవిచారణ మని కాని చెప్పవచ్చును.

ఏదైన నొక కావ్యమును దీసికొని 'దీనియాధిక్యమేమి? ఇ దెంత వఱకు రసవంతమైన కావ్యము? దీని యాధిక్యమునకును, సర్వజనాదరణీయంబై యిది యింత కాలంబు నశింపకుండుటకును గారణమేమి?' అని యడుగవచ్చును. ఇట్టి ప్రశ్న వేయుటకుఁ గాని, దానికి సమాధానము చెప్పుటకుఁగాని, ఆ కాలమందును అంతకు పూర్వమును జరగిన చరిత్రాంశముల నెఱిఁగియుండుట గాని, కవిజీవితముతోడి పరిచయము గాని యవసరము లేదు. నిజముగ నుత్కృష్టకావ్యము లొక కాలమునకే చెందునవి గాక సార్వకాలికములై యుండును. ఇట్లని ఆ కాలమందలి ధోరణి లేవియు నా కావ్యములయందుఁ గానరావని యభిప్రాయము కాదు. కాళిదాసకృత కావ్యము లొక కాలమునందలి యొక జాతియొక్క యాచారవ్యవహారములను వర్ణించినవైనను, ఇప్పటికిని తదితరజాతుల జనంబులకుఁ గూడ నానందంబు గూర్చుచున్నవి. కాని, పోతన మహాకవి కృతంబైన భోగినీదండక మా కాలమునఁ గొంత యాదరము వడసినను ఇప్పటి కాలమున బడయఁజాలదు, పడయుటయును లేదు. ఇట్లు కవి జీవితమును గూర్చి యేమియుఁ దెలియకున్నను ఆతనిచే రచియింపఁబడిన కావ్యము గొప్పదై యుండెనా దాని యాధిక్యమెన్నఁటికిని నిలిచియే యుండును. తిక్కన సోమయాజి జీవితము మనకుఁ దెలియకున్నను ఆతని భారతము చదివి మన మానందించుచునే యున్నాము. కాని కవియొక్క జీవితచరిత్రము ఆతని కాలమందలి యాచారములును మనకు బాగుగఁ దెలిసెనా, కవి వాని వలన నెట్టి యుద్రేకమును బొందెనో, వాని నెట్లు తన కావ్యమున నివేదించెనో గ్రహింపఁగలము వాని యుద్దేశములను

బాగుగ గ్రహింపఁగలము; అప్పుడు కవిహృదయము మనకు బాగుగ బోధపడఁగలదు. కాని మన కవులే పురాణగాథనో తమ కావ్యమున కితివృత్తముగఁ దీసికొని దాని నించుక మార్చియో మరికొంత చేర్చియో దానియందే తమ వర్ణనాచాతుర్యమును జూపుచు పరమార్థోపదేశము చేయఁబూని యున్నతాదర్శములను చాలు నున్నతపాత్రలను వాఙ్మయమున నెలకొల్పిరి. కాని వారు మానవజీవితమునుగుఱించి గాని మఱి యే విషయమునుగుఱించి గాని తమ యభిప్రాయమును దెలుపుచు తమ విషయమై యే విధమైన ప్రశంసయైన చేయుచు వ్రాసిన గ్రంథములు తెలుఁగుభాషయందు మిక్కిలి తక్కువ. అట్టివి శతకములలోఁ గొన్ని భాగములును, కావ్యములయందలి పీఠికలలోఁ గొన్ని భాగములును, మాత్రము కలవు. తమ యభిప్రాయములను వెల్లడిచేయుచు కావ్యములను వ్రాయువాడుక మన తెలుఁగు కవులలో లేదు. మనకవులకు, జనులకుఁ గూడ పురాణములయందును పూర్వగాథలయందును ఆదరమెక్కువ. కావుననే వా రా పురాణపురుషలోకమునుండి సామాన్య జనసమితిలోనికి దిగక, పూర్వలాక్షణికులచే నిర్ణయింపఁబడిన నిబంధనలఁబట్టియే కావ్యరచనకుఁ బూనుకొనుట తటస్థించినది. మఱియు వీరు రాజుల యాస్థానములలో నుండి వారి యనుగ్రహమునకై కావ్యములు రచించుచుండుటం జేసియు, వీరికి సామాన్యజనులజీవితముతో నెక్కుడు సంబంధము లేకుండుటం జేసియు వీరి కుత్తమపాత్రలు ధీరోదాత్తాదినాయకులు పురాణగాథలందుఁ గన్పట్టెనే కాని, తాత్కాలిక దేశచరిత్రయందంతగాఁ గన్పట్టలేదు. మఱియు నీ లాక్షణికుల నిబంధనలు

కవుల స్వాతంత్ర్యమునకు మారకము లని చెప్పవచ్చును. కావు ననే ఒకటే విధమగు వర్ణనలు, ఒకటే విధమగు రాజులు, ఒకటే విధమగు నాయికా నాయకులు గన్పట్టుదురు. ఈకావ్యములలో వర్ణింపఁబడిన జనులలో మానవ ప్రకృతిభేదములు విశేషముగాఁ గనంబడవు. కాని యీ సందర్భమున జ్ఞప్తియం దుంచుకొనవలసిన యంశ మొకటి మన కవులే గ్రంథములయందును తమ యభిప్రాయములను వెలిపఱుపకుండుటయే. కావున కావ్యము యొక్క గుణములను పరీక్ష చేసి దానియందలి యాధిక్యమును కనుఁగొనుటకుఁ బ్రయత్నించుటయే మనము చేయఁగలిగిన పనియై యున్నది. ఇట్లు కావ్యములను విమర్శించు పద్ధతులు ద్వివిధములై యున్నవి. మొదటిది కావ్యవిషయమునకు లేక వస్తువునకు చెందియున్నది. అనగా కథ, రసము, ఊహాపోహాలు మొదలయినవి. రెండవది కావ్యాకారమునకుఁ జెందినది; అనఁగా కావ్యస్వరూపము పద్యములసొంపు మొదలయినవి. కావ్య విమర్శనమున, ఈ లక్షణములలో నొకదానికి మఱియొక దానితోఁ గల సంబంధము, వానిలో వివిధము లగువానికిఁ గల ప్రాముఖ్యము, ఎట్టి లక్షణము లేయే విధమయిన కావ్యరచనకు చెందునో మొదలగు విషయము లన్నియుఁ జర్చింపఁబడును. ఈ విధముగ నాలోచించినయెడల విమర్శన మనునది విద్య గాక శాస్త్రమగును. శాస్త్ర మని చెప్పుటవలన, ఏదైన నొక కావ్యమును దీసికొని దానిని విమర్శన చేయక విమర్శనపద్ధతులను మాత్రమే విశదీకరించుట యని తెలియుచున్నది. సామాన్యముగా కావ్యవిమర్శన మనఁగా నేదైన నొక కావ్యమును విమర్శన చేయుట యని తలంతురు. కాని విమర్శన చేయుట కాధా

రముగా నందఱిచే నంగీకరింపఁబడినట్టియు ప్రపంచము నందలి వాఙ్మయమును బరిశీలించి గ్రహింపఁబడినట్టియు కొన్ని సంగతులను వ్యాపకము చేయుటయే దీని ముఖ్యోద్దేశమై యున్నది. కావున విమర్శన మట్టి ముఖ్యసంగతులను గుర్తించుట కావశ్యకమైన కొన్ని ప్రమాణములనుగాని విధానములనుగాని సూచించును.

దీనినిబట్టి విమర్శనముగూడ అలంకారశాస్త్రాంతర్భాగమే యని యెంచరాదు. లక్షణశాస్త్ర మని మన వా రలంకార శాస్త్రమునకు పేరు పెట్టుచున్నను నిజముగా నది శాస్త్రము కాదు. అది విద్యయై యున్నది. కనుక నిచ్చట 'కావ్యలక్షణ' మని యుపయోగింపఁబడినప్పుడు దానివలన నేవిధమయిన కావ్యమునైన రచించుటకుఁ దగిన విధానములను దెలుపునదని గ్రహింపవలయును. అనఁగా కావ్యలక్షణమునకును, కావ్య విమర్శనమునకును గల భేదమిది. కావ్యలక్షణ మేదైన నొక కావ్యము నెట్లు వ్రాయవలయునో చెప్పును. కాని కావ్య విమర్శనము వ్రాయఁబడిన యేదైన నొక గ్రంథము నెట్లు పరిశీలింపవలయునో, దానిగుణముల నెట్లేర్పఱుపవలయునో చెప్పును. కావ్యలక్షణమున కొకసంగతి చెప్పఁదగినదియా కాదాయను విషయముతో సంబంధము లేదు. చెప్పఁబడిన సంగతి చెప్పఁదగినదేనా యనియు, అది జనుల కేవిధముగ నగపడునో యనియు కావ్యవిమర్శనము చర్చించుచుండును. కావ్యలక్షణము గుర్తింపఁజాలని యనేక సూక్ష్మలక్షణములను గూడ గ్రహించుచు కావ్యవిషయమునకు కావ్యరూపము సరిపడి యుండెనా లేదా అని కూడఁ బరీక్షించుచుండును. కావున కావ్య

రచనావ్యాపారముకన్న కావ్యవిమర్శనవ్యాపార మధికము. కాని విమర్శనపద్ధతులు కావ్యలక్షణముయొక్క పద్ధతులవలె మిక్కిలి విస్పష్టముగ నుండఁజాలవు. ఇట్లు విమర్శన మొక శాస్త్రమనియు. అది సరియైన వాఙ్మయమున కుండవలసిన లక్షణముల నేర్పఱుపఁబూను ననియు, ఈ లక్షణముల నేర్పఱచుట కావశ్యకములైన విధానములే మిగిలిన కావ్యములను పరీక్ష చేయుట కుపయోగపడు ప్రమాణము లనియు చెప్పఁదగి యున్నది

కాని కొందఱీ విధముగా ప్రమాణముల నేర్పఱుచుటకు వీలు లేదని వాదింతురు వారి వాద మిది: వాఙ్మయ విషయములలో స్వాభిప్రాయముకన్న మిన్నయైన ప్రమాణము లేదు. ఒక కావ్యమునుగూర్చి భిన్నాభిప్రాయములు గలిగినచో నొకదానిని మఱియొకదానికన్న నెక్కువగా నెంచుటకుఁ గారణ మేమియు లేదు. అభిరుచి విషయమున బాహ్యప్రమాణ మేయుండుటకు వీలు లేదు. ఏదైన నొక గ్రంథ మాహ్లాదదాయకమై యున్నయెడల సరి. అంతేకాని, ఆ యానందము నిజమైన దని కాని కాదని కాని చెప్పుటకు వీలు లేదు. ఒకటి యెక్కువ యని కాని తక్కువ యని కాని యనరాదు. కావ్యము చదువరుల కానందమును కలుగఁజేయుటయే ధర్మముగాఁగలది. అది నాకు సంతోషమును కలుగఁజేసినయెడల, అది మంచి కావ్యమని నే నెంచెదను. చాలమందికి సంతోషమును కలుగఁ జేసినయెడల చాలమంది మెచ్చెదరు. కాని దానినిగూర్చి తారతమ్యపరీక్ష చేయుటకు వీలు లేదు. కావ్యవిషయికాభిప్రాయము లభిరుచినిబట్టి యుండును గావున, వానికిఁ గారణ

ములను చూపఁజాలము. అవి నియమబద్ధము లు కావు. ఇది వీరి వాదము.

ఈ వాదమును కొంచెము పరిశీలింపవలయును. కొన్ని కావ్యములు వాఙ్మయమున తదితరములకంటె నెక్కుడుగా జనులచే నాదరింపఁబడుచున్నవి. నైతిక ప్రతిపాదన మొకవేళ నీ గ్రంథముల కా యాధిక్యమును తెచ్చి పెట్టినదని చెప్పుటకు వీలు లేదు. ఏలయన మంచి నీతులను గఱపునదైనను ఒక కావ్య ముత్తమలక్షణములతోఁ గూడియుండక జనుల యాదరము వడయలేక పోవచ్చును. కావున నిట్టి భేదములు కలుగుటకుఁగాను స్వాభిప్రాయాధీనములు కానట్టియు, అంతకు భిన్నములై కవితయందుత్కృష్టతా నిర్ణాయకము లగునట్టియుఁ గొన్ని ప్రమాణము లుండవలయును. 'లోకోభిన్నరుచిః' అనుటవలన అభిరుచి కధీనములగు విషయములయందు జనుల యిష్టానిష్టములను గూర్చి మన మేమియు నిర్ణయింపఁజాలమనియే కాని, అట్టి యభిరుచి సరిగ నుండెనో లేదో యను విషయమును నిర్ణయించుటకు ప్రమాణములే యుండఁగూడదని కాదు. ఇంగువవాసన యొకని కింపుగ నుండును: మరియొకని కసహ్య మగును. ఇట్టిచో నింత 'దుర్వాసనగల వస్తువు నీ కెట్లింపుగ నుండె' నని కాని 'ఇంత సువాసన గల వస్తువు నీ కేల సహ్యము కాకుండె' నని కాని యడుగరాదు. ఒకనికి దంపుళ్ల పాటలు త్యాగరాయకృతులకన్న నింపుగా నుండవచ్చును. దీనినిబట్టి త్యాగరాయకృతులు దంపుళ్ల పాటకన్న మంచివి యనుటలో నర్థము లేకపోలేదు. దంపుళ్ల పాటలయం దభిరుచి కలవారొకరే కాక వానికి సహాయముగ నూఱుగు

రున్నను, వా రందఱు గూడ తక్కువ దానియం దౌత్కర్ష నాపాదించి పొరపడి రని చెప్పుటకు వీలు కలదు. కావున పలు వుర కొకటి రుచించినంత మాత్రమున నద్దానియం దుత్కృష్ట గుణములు కల వని చెప్పుటకును వీలుపడదు. ఇట్టి విషయము లందు గూడ నెక్కువ తక్కువలు సకారణముగ నిరూపింప వచ్చును. అవి యొక్కువమంది యభిప్రాయమువలన మాత్రమే యట్లు నిరూపింపఁబడుచున్న వని యెంచరాదు.

సరే, ఇది నిజమై యుండవచ్చును. కాని బుద్ధిమంతు లును తగు సామర్థ్యము కలవారును నగు విమర్శకులయందుఁ గల భిన్నాభిప్రాయములనుగూర్చి యేమి చెప్పుదు రని యాక్షే పణ కలుగవచ్చును. అభిరుచియందలి ప్రమాణములు వేర్వేఱు దేశములలో వేఱువేఱుగా నున్నవి. ఒక దేశమందే ఒక కాలమందలి యభిరుచిప్రమాణములకును, ఇంకొక కాల మందలి వానికిని భేదము కలదు. ఒక కాలమునందే సమర్థులగు విమర్శకులు కొందఱు కొన్ని కావ్యములను గొప్పవిగను మఱి కొంద ఱా కావ్యములనే న్యూనములుగను నెంచియున్నారు. శృంగారవర్ణనతో నిండియుండిన గ్రంథము లొకకాలమున జన రంజకములుగానుండును. మఱియొక కాలమున నవి యొక్కువగా నెంచఁబడుట లేదు. కాని కొంచె మాలోచించినచో నీ ప్రక రణములయందలి భేదములు నిజముగా నగపడుచున్నంత యధికమైనవి కావని తెలియక పోదు. వేఱువేఱు మనుష్యుల యందును కాలములయందును జాతులయందును కనఁబడెడి యభిరుచియందు భేదాంశముల కన్న సాదృశ్యాంశము లెక్కు వమై యుండును. ఎట్లయిన నీ సాదృశ్యాంశములే ముఖ్య

నైనవి. వీనినిబట్టియే వాఙ్మయము శాశ్వతస్వరూపమును బడయుట, కళలు శాశ్వతస్థాయులై యుండుట తటస్థించును. వ్యాస వాల్మీకికృత భారత రామాయణములు రచింపఁబడిన కాలమునకంటె నిప్పటి కాల మెంతో మార్పు చెందినది కాని యా గ్రంథము లేమాత్రము ప్రాతబడలేదు. ఆ కాలమున నా గ్రంథముల నేయే లక్షణములకై యభినందించియుండిరో యాలక్షణములవలననే యిప్పుడు మనము వానిని చదివి యానందించుచున్నారము. కావున నా కాలమున నే లక్షణములు కలది నిజమగు కవితగా నెన్నఁబడినదో అట్టిదే యిప్పుడుకూడ కవితా శబ్దవాచ్యం బగుచున్నది. ఇట్లభిరుచియందు కొంతవఱకు సామ్యముండుటచేతనే సార్వకాలికము లగు విమర్శనాధారములు కలుగుటకు వీ లగుచున్నది.

ఇంతియ కాదు. కొన్ని విషయములనుగూర్చి యభిరుచియందు భేదములు కనఁబడుచున్నను అవి యన్నియు మఱికొన్ని ముఖ్యాంశములనుగూర్చి మనకుఁ గల యభిరుచియొక్క సామ్యముతోఁ గూడి యుండవచ్చును. కొన్ని విషయముల నభిప్రాయభేద ముండినను ముఖ్యాంశములలో నేకీభావముండ వచ్చును ఇట్లు నాటకరచనయందు కొందఱు మహాకవులు 'విషయైక్యము' 'కాలైక్యము' 'స్థలైక్యము' ఈ మూటి నవశ్యముగ పాటింపవలయు నని యభిప్రాయపడినను, తరువాత మఱి కొందఱు ఈ మూటి నంత యావశ్యకముగ నెంచియుండ లేదు. దీనియం దిట్లభిప్రాయభేదము గలదు. అట్టి యభిప్రాయ భేద మున్నను నాటకరచనమునందు విషయైక్య మెల్లప్పుడు నావశ్యకమే యని యన్ని మతములవారు నొప్పుకొనవలసి యున్నది.

ఇట్లు సమర్థు లగు విమర్శకులలో నభిప్రాయభేద మొకొ్కక రొకప్పుడు కలుగుట మిగిలిన ముఖ్యలక్షణములకంటె నత్యావశ్యక మని తలంచుట మూలమునఁ గలుగుచున్నది.

ఇంతవఱకును విమర్శకుల యభిప్రాయములయందు భేదము లుండుటచే సర్వజనాదరణీయము లగు విమర్శనవిధానముల నేర్పఱచుటకు వీలులేదను నాక్షేపణలనుగూర్చి విచారించియున్నాము. మఱికొందఱు వాఙ్మయముయొక్క స్వభావమునుబట్టియే, విమర్శనశాస్త్ర మనునది యొకటి యుండుటకు వీలు లేదని యనవచ్చును. వారి వాదము నీక్రింద పొందుపఱచుచున్నాము. కావ్య శృంగారముల చదివినపు డొకవిధమగు నానందము కలుగును హాస్యప్రబంధములు చదివినపుడు మఱి యొక విధమగు నానందము వొడమును. వీరగసభరితంబు లగు కావ్యములు వేఱొక విధమైన యానందమును కలిగించును. మత గ్రంథములవలనఁ గలుగు నాహ్లాద మొక విధమైనది; ఇట్లు వాఙ్మయముయొక్క ఫలసిద్ధి యనంతము. అట్టిచో వీని కేకీభావము కుదురు టెట్లు? అట్టి యేకీభావమే లేనప్పుడు విమర్శన శాస్త్ర మనునది యె ట్లుండనగును? అనఁగా బాహ్యప్రపంచమున నెన్నెని తెఱఁగు లగు వస్తువు లున్నవి; వానిని జూచుట వలన మన కెన్నెని మనోవికారములు కలుగుచున్నవి. అట్లే కవిత యాయా వస్తువుల నన్నిటిని ప్రదర్శించునది గావున దాని వలన మనకుఁ గలుగు మనోవికారములు కూడ ననంతములగు చున్నవి. ఇట్టియెడ నీ యనంతము లగు కావ్యముల కన్నిటికిని జెందు విధానముల నేర్పఱచు టెట్లు? "బాణు వేగంబును, భవభూతి సుకుమారతయు, మాఘు ...... దండిసమత, అల

మయూరుని సువర్ణకలన, చోరుని యర్థసంగ్రహంబు, మురారి కయ్యనేర్పు,సోము ప్రసాదంబు, సోమయాజుల నియమంబు, భాస్కరుని సన్మార్గఘటన, శ్రీనాథుని పద ప్రసిద్ధధారాశుద్ధి, అమరేశ్వరుని సహస్రముఖదృష్టి" యను కావ్యమునకు కావలసిన యుత్తమ గుణములే. ప్రబంధ మేవిధమున కవిత యగుచున్నదో ఆవిధముననే శతకము నగుచున్నది. "బ్రతికియుండిన సుఖములఁ బడయవచ్చు" "ముగురం గూర్చిన ముండ దైవమునకుఁ మోమోట లేదో సుమీ" ఇత్యాది వాక్యములు కూడ నుత్తమ కవితాలక్షణమును పొందియున్నవి. ఏమున ప్రతిమలను చేయువాని నేర్పు కృష్ణదేవరాయని కాలమున స్థాపింపఁ బడిన యుగ్రనరసింహ విగ్రహమునం దెట్లు చూపింపఁబడినదో, అట్లే యొక వజ్రాంగుళీయకమునందును చూడవచ్చును. కావున ననేక విధములుగ కవితలు వాఙ్మయ స్వరూపమును చెందును. ఒకానొకప్పుడు మన బుద్ధిని సంతోషపెట్టుటచేతనో భావోద్రేకము కలుగఁజేయుటచేతనో ఒక కృతి ఘనత వహింపవచ్చును. ఒకప్పుడు పదసౌష్ఠవముచే పేరుగాంచవచ్చును. ఇట్లనేక విధముల నుత్కర్షం బడయవచ్చును. వీని నన్నిటిని కొన్ని సామాన్యజాతులుగ మార్చితిమా, వానియందలి వ్యక్తిభావము నశించుచున్నది. ఇట్టి జాతులు చాల నుండిన యెడల మన బుద్ధియొక్క శక్తులను, భావములయందలి భేదములను వర్ణించుటలో గందరగోళమో లేక సంక్షోభమో తప్పదు. కావున విమర్శనముయొక్క ముఖ్యవ్యాపార మేమి యనఁగా—ఒక కృతియందేమేమి యుత్తమ గుణములు కలవో రసానుభవము నానందము నెట్లుకలుగుచున్నదో చూపించుటయే కాని, ఈ

కావ్య మింకొక కావ్యముకన్న గొప్పది—లేక తక్కువదియని చూపించుట కాదు. అభిరుచికి ప్రమాణముల నేర్పరచుటయుఁ గాదు. విమర్శకుఁ డొక గ్రంథము చదివి తన కానందమును గలుగఁజేసిన భాగములు ఇతరులకుఁ గూడ నారీతిగ నానందము కలుగఁజేయు నను తలంపుతోఁ జూపించుట మాత్రమై యున్నది. ఏ విమర్శకుఁడు తెలివి గలవాఁడును సానుభూతి కలవాఁడును నగుచున్నాఁడో యాతని విమర్శ బాగుగనుండును.

ఈ వాదమున కొంత నిజము కలదు. దీనివలన విమర్శనము సర్వవ్యాపి యగు వ్యాపారము గాక, దాని ప్రవృత్తికిఁ గొంత పరిమితి గల దని తేలుచున్నది. కావ్యగుణములు నిజముగ ననంతములు. కాని వానియందు గొంత వ్యవస్థ కలిగించుటకు వీలు లేదని యెంచరాదు. ఎప్పుడొక కావ్యగుణము మఱియొక కావ్యగుణమునుండి భిన్న మని మనము గుర్తించుటకు వీ లున్నదో, అప్పుడే యీ భేదములను గనుఁగొనుట కుపయోగించు నాధార మొకటి యున్నదనియును తేలుచున్నది. కాని ఈ వేలువేలు గుణములను చూపించుచుండిన కావ్యములన్నిటియందును గూడ నెట్టి సమానలక్షణము లుండుటచేత నే వీనిని కావ్యము లనుచున్నామో, వీని నన్నిటిని కలిపి వాఙ్మయ మనుచున్నామో వానిని నిరూపింపవచ్చును. భావనాశక్తి కావ్యములలో వేయి విధములుగ నగపడవచ్చును. అయినను కవనమునకు భావనాశక్తి యావశ్యకము గదా. కావున భావనాశక్తి యననేమో, అది యెట్లు పనిచేయుచుండునో చెప్పుట వలన వాఙ్మయమును మనము సరిగా గ్రహింపవచ్చును.

ఇంతవఱకు చర్చించిన యాక్షేపణలు గాక, వేఱొక యాక్షేపణ చేయఁబడుచున్నది. ఇది వెనుకటి మూఁటికన్నను బలవత్తరమగుటచే దీనిని జాగరూకతతోఁ బరిశీలింపవలయును వాఙ్మయము భావయుంను వ్యక్తిభావముచు ప్రదర్శించుచు. వాఙ్మయ మన నేమి యను ప్రశ్న కుత్తరము 'అది ధీ ప్రభావ' మని చెప్పుటయే. అది యనిర్వాచ్యమును, వర్ణనాతీతము నగు దానిం దెలుపునదియై యున్నది. ధీ ప్రభావ మిూ యీ నియమముల ననుసరించి యుండవలె నని మనము చెప్పఁజాలము. మన మెన్ని నియమములను చేసినను వాని ననుసరించిన రెండింటిలో నొకటి యుత్తమ కవిత కావచ్చును; రెండవది కాకపోవచ్చును. విమర్శనమార్గములకుఁ గారణమును జూపఁజాలదు. ఒకదో ధీ ప్రభావము కలదనియు రెండవదో లేదనియు మాత్రము విమర్శకుఁడు చెప్పఁగలుగును. ఏ మన, ధీ ప్రభావము పృథక్త్వముగలది. దీనియొక్క లక్షణ మద్వితీయతయే అట్టి యద్వితీయ మగు దాని నెట్లు నిరూపించుట? లేక వర్గీకరణము చేయుట? కనుక నిజముగ నిట్టి పృథక్త్వముచు వ్యక్తీకరించు కావ్యమెల్ల నూతన నిర్మాణ మగుచున్నది. దీనియొక్క ఘనత ఈ యద్వితీయతయందే యుండుటచే దానిని మన నియమములు బంధింపవు. పోతన యెంతవఱకు నన్నయ తిక్కనలను పోలి యుండెనో, వారికంటె భేదమును కనఁబఱచుచుఁ దన వ్యక్తి భావము నే విషయమున కనఁబరచెనో చెప్పుటచేత విమర్శకుఁడు మనలను పోతనను బాగుగ గ్రహించునట్లు చేయఁ జాలఁడు. పోతనయందు ముఖ్య మగునట్టియు, ఇతరకవులందు లేనట్టియు విషయములను గుర్తెఱుంగుటకుగదా మన ప్రయ

త్నము. ఇందువలననే మనము పోతనను గ్రహింపఁగ చున్నారము. ఇట్లు గ్రహించుటకు విమర్శకుఁ డెట్లు సహాయ కారి యన్నాఁడు ? అని వీరు చెప్పుచున్నారు.

ఎట్టి విమర్శనయు నీ పై కార్యమును మనకొఱకు చేయఁ జాలదు. ఒక గ్రంథమునం దా కవి రచనాతత్త్వమును ఆతని హృదయమును గ్రహించుటకై మనమే యా గ్రంథమును జదువవలయును. ఎవరికి వారే చదివి యానందింపవలయును. పంచదార రుచి యెంత వర్ణించినను, 'అది దానినీ పోలియుం డును, దీనిని పోలియుండును' అని చెప్పినను, దానిని స్వయ ముగా రుచిచూచినఁ గాని రుచి తెలియదు. పంచదార రుచి పంచదారదే, అది వర్ణనాతీతము. ఇట్లే ప్రతి యుత్తమ కావ్యము యొక్క ఘనతయుఁగూడ కొంతవఱకు వర్ణనాతీతము. కావున విమర్శన విధానము ఉతి స్వల్పముగ నుండవలెను. సర్వతః ప్రసృమరము లగునట్టియు సవిస్తరము లగునట్టియు విధానముల నేర్పఱుపఁబూనరాదు. అట్లు చేసినచో నవి పరం పరాగతము లగునట్టివియైన కావలయును, లేదేని వేఱువేఱు విమర్శకుల స్వాభిప్రాయములుగనైన నుండవలయును, లేదా ప్రస్తుతకాలమునకు మాత్రమే చెందునవి యైనను గావల యును. కాని యవి సార్వకాలికములు సార్వజనీనములై యుండ నోపవు. ఇట్టి నియమములను మనవారలు చేసియుండుటచేతనే ఆంధ్రవాఙ్మయమునం దిటీవలకాలమున నొక్క రూప మగు కవితయే వెలువడినదని చెప్పవలసి వచ్చుచున్నది. కావుననే కవియం దుండవలసిన సత్త్వము నశించి యొక్క రూపమునే పొందియున్నది. వసుచరిత్ర తరువాత వేనినైన నిరువది ప్రబం

ధములను దీసికొని యొకటి రెండవదానికన్న నెట్లు భిన్న మగు చున్నదో నిరూపింపఁ బ్రయత్నింపుఁడు. పురవర్ణనము, పుష్ప లావికావర్ణనము, రాజవర్ణనము మొదటి యాశ్వాసమునను; వేఁట మొదలగునవి రెండవ యాశ్వాసమునను; ఇట్లే మఱి కొన్నివిషయము లితరాశ్వాసములను కనఁబడుచున్నవి. ఆ కావ్యముల కథాభాగమున కిసుమంతైన నడ్డు కలుగకుండ మూఁడుమాతుల పద్యములను దీసివేయవచ్చునుగదా! ఒక గ్రంథములోని కథానాయకుని మఱియొక గ్రంథమున కథా నాయకునిగాఁ జేయవచ్చునుగదా' ఇట్టిస్థితి ఆంధ్రవాఙ్మయ మున కేల వచ్చినది? పూర్వలాక్షణికు లేర్పఱచిన నిబంధనల వలననే కదా! స్వతంత్రప్రతిభ యీ నిబంధనలకు లొంగి యుండునా? అందువలన విమర్శనవిధానములు వాఙ్మయ నిర్మాణవిధానములు కాఁజాలవు, కాఁగూడదు, కావు. ఆ విధానములు కవికై యుద్దేశింపఁబడియుండలేను. అతని కవితా రసమును గ్రహింపనెంచువారలకై యుద్దేశింపఁబడినవి. 'కవిర్జా యతే న క్రియతే' యను వాడుక కలదు. భావోద్రేకము కలిగి కవిత చెప్పువాఁ డీ విధుల ననుసరింపఁడు. ఇంతేగాక అతని కవిత నాధారము చేసికొని యీ విధు లేర్పఱుపఁబడుచున్నవి. 'అంద రును జెప్పుచుండిరి, నే నేల చెప్పఁగూడదు?' అని యేవో చీపుర పాపరతీఁగెల చేఁపల బుట్టల్లినట్లు పద్యములు గూర్చువాఁడు కవి శబ్దవాచ్యుఁడు కాఁజాలఁడు. అట్టివాని కవిత "భోజనం దేహి రాజేంద్ర ఘృతసూప సమన్వితం"మను నట్లుండునే కాని, "మాహిషం చ శరచ్చంద్ర చంద్రికాధవళం దధి" యనునట్లుం డదు. విధులను గమనించి యుండవచ్చునుగాని కవి కాఁజాలఁడు.

ఇంతకును తేలిన దేమనఁగా విమర్శనవిధానము లెంత బాగుగా నుండినను, విమర్శన చేయఁబూనువానికి సహజముగఁ గొంత రస గ్రహణశక్తి యుండని యెడల నవి యేవియుఁ దోడ్పడ వనియే. తాను విమర్శనచేయు గ్రంథము నవగాహనచేసికొనుటకుఁ దగిన సామర్థ్యము స్వయముగా నుండవలెను; కాని విమర్శన విధానములు వానికట్టి సామర్థ్యమును కలుగఁజేయఁజాలవు. అట్టిశక్తియున్న యెడల విమర్శనవిధులు దానిని క్రమపరచి యుపయోగపడునట్లు చేయును.

విమర్శకుఁడు ప్రతిభావంతుఁ డాయెనా అతని వ్రాఁత కూడ వాఙ్మయమునఁ జేరుచున్నది. అదియు నుత్తమకావ్యము వలెనే మన బుద్ధిని భావములను గూడ తృప్తిపఱచును.

పైని చెప్పఁబడిన సంగతులనుబట్టి విమర్శనయనఁగా దోషారోపణ కాదని తేలుచున్నది. అయినను ఆ గ్రంథకర్త కుకవి యని పరిగణింపఁబడు నేమో యను భయముచే దోష ములను దోషములని చెప్పుటకును భయపడఁగూడదు; లేని గుణ మొక కావ్యమునం దున్నదని చెప్పుచు జనులను మోస పుచ్చనురాదు; ఉన్న గుణములను గణనచేయక యుండను రాదు.

# నన్నయకుఁ బూర్వ మాంధ్రవాఙ్మయస్థితి.

---

నన్నయ భారతము నాంధ్రీకరించుటకుఁ బూర్వ మాంధ్ర భాషావాఙ్మయము లేస్థితిలో నున్నవను విషయమును బరిశీలింపవలసివచ్చినపుడు ఆ కాలమునందలి దేశీయభాషల స్థితిగతులు, వాని యాదరణము, సంస్కృతమునకు వానికిని గల సంబంధము, సన్నిహితభాషలలోని వాఙ్మయస్థితి, తమిళ కన్నడములలోఁ బూర్వవాఙ్మయము కనఁబడుచుండఁగా నీభాషలో నన్నయకుఁ బూర్వమునఁగల వాఙ్మయము కనఁబడకపోవుటకుఁ గల కారణమేమి, ఉన్నచో నెట్టి రూపమున నుండియుండును, అను నీ మొదలగు విషయములనుగూర్చి విచారింపవలసి యుండును. కాని ప్రస్తుతము నన్నయకుఁ బూర్వమందు ఆంధ్రవాఙ్మయముండినచో నెట్టిరీతి గలదయి యుండునను విషయమును మాత్రము పరిశీలించుచు, కన్నడవాఙ్మయ సంప్రదాయము లాంధ్రమునందలి తొలికవితారీతి నెట్లు దిద్దినవో తెలిసికొన నించుక యత్నింతము.

నన్నయకుఁ బూర్వమునఁగల చాళుక్యరాజుల తెలుఁగు శాసనములలోఁ గొన్నిటినిబట్టి చూడఁగా, నన్నయ తెలుఁగు రచననుబోలిన సంస్కృత భూయిష్ఠమగు తెలుఁగురచన యాతనికి సుమారు రెండువందల యేండ్లక్రితమే యుండెనని తలంపఁదగియున్నను, అట్టి శైలి రాజాస్థానములందలి పండితకవులచే నాదరింపఁబడుచుండెనేగాని, జనసామాన్యమున వ్యాప్తిఁజెంది యుండలేదనికూడ మఱికొన్ని శాసనములనుబట్టి యూహిం

చుట కవకాశము కలుగుచున్నది. ఈ శాసనములలోని పద్యము లన్నియు దేశీయవృత్తములలోనే గాని సమకాలికములగు కన్నడశాసనములలోవలె సంస్కృత వృత్తములతో రచింపఁ బడకుండుటయు, గొన్నిటియందలి భాష ప్రాకృతసంపర్కమును విశేషముగాఁ జూపుచుండుటయు మఱియొక విశేషము. నన్నయకుఁ బూర్వమున నీ భాష కను శాసనము లేకపోవుట చేతను, అప్పటి శాసనములు కొన్నిటిలోమాత్రము నన్నయ శిష్ట కవితాభాషను బోలు భాష గానవచ్చినను, అప్పటి శిష్టులగు పండితకవులచేఁ బ్రామాణికముగా గ్రహింపఁబడు నా భాషలో నుత్తమ గ్రంథము లేమియు బయలుదేరినట్లగపడక పోవుటచేతను, నన్నయకుఁ బూర్వకాలపు తెలుఁగుకవిత యంతయు శిష్టుల యాదరమును బడయఁజాలనిదియు, సంస్కృత విరళంబును సామాన్యజనవ్యవహార ప్రచురంబును నగు తెలుఁగు భాషలో నుండెడిదనియు నిశ్చయింపఁ దగియున్నది. అప్పటి దేశీయకవులు మన మెఱిఁగిన శాసనపద్యములను రచించిన శిష్ట కవులవలెనే ద్విపద, తరువోజ, సీసము, గీతము మొదలగు దేశీయచ్ఛందముల మూలముననే తమ రచనలను సాగించుచు వారు తమ వ్యవహారభాషలో నాయా కథలను, నాయా పద్యములలో పాడియుండిరే గాని, శాసనకవులవలె వ్రాయఁ బడుటకై రచించియుండురని తలంచుట కవకాశము కనఁబడదు. ఈ దేశీయకవు లాకాలమునఁ బాడిన తెలుగుపాటలు జన ముఖస్థములై యుండినవేగాని గ్రంథస్థములై యుండెననియు మన మూహింపఁజాలము. ఇఁక వా రాకాలమున పాడినభాష స్వరూపము మనము తెలిసికొనవలయు నన్నచోఁ గొన్ని శాసన

ములలోని భాషతప్ప మఱి యే విధమగు నాధారము లేదు. కాని, నన్నయాది శిష్టకవుల సంస్కృతభూయిష్ఠ రచనా రూపమగు మార్గకవితకు భిన్నమైనదియు, దేశికవుల కవశ్యాదరణీయమని తరువాతికాలపు శైవకవులచేఁ బేర్కొనఁబడినదియు, దేశిమార్గమునుబట్టి దేశీయముగా రచింపఁబడిన జాను కవితకు మూలాధారం బైనదియు నగు జాను తెనుఁగే తత్స్వరూపమును మనకుఁ గొంతవఱకైనను గోచరింపఁజేయుఁ గలిగి యుండునని తలంపనగును. జాను తెనుఁగుస్వరూప మిట్టిదని పాల్కురికి సోమనాథకవి వృషాధిపశతకము న మనకిట్లు తెలిపియే యున్నాఁడు గదా !

"బలుపొడతోలు సీరయును బాపసరుల్ గిఱుసాఁచుకన్ను వె
న్నెల తల సేసకుత్తుకయు నిండినవేలుపుటేరు వల్గు పూ
సలుగలతేని లెంకవని జాను తెనుంగున విన్నవించెదన్
వలపు మదిం దలిర్ప బసవా బసవా బసవా వృషాధిపా."

కాని నన్నయకుఁ బూర్వమునఁ గల దేశికవుల జాను తెనుఁగున మాత్రము సంస్కారము నుండియుండదు. అది చాలవఱకప్పుడు వ్యవహారమందున్న భాషకు చేరికగలదై, సంస్కృత దీర్ఘసమాస విరళంబై నియమ రహితంబై యుండియుండును. ఆ దేశికవులు తమ భావముల నేద్విపదనో, సీసమునో యవలంబించి పాడునపుడు, భాషారూపములను, ఛందోనియమములను గూడ నాయా పాటల కనుకూలమగునట్లుగా, వికృతినొందించి - అనఁగా నా పాటలో గురువు కావలసినచోట హ్రస్వాంత పదము నైనను దీర్ఘాంతముగాఁ జేసియు, లేదా రెండు మాత్రలుగల మూలుగు మూలిగియు, హ్రస్వము కావలసిన

చోట దీర్ఘాచ్చ పదమునైనను హ్రస్వాచ్చముగాఁ జేసియో, లేదా ఆ పదమునందలి యొక యక్షరమును సరిగా పలుకక జాఱవిడిచియో - యాయా పద్యములలో పాడియుండుటచే భాషావిషయమునగాని, ఛందోవిషయమునగాని, వారికవిత, నియమబద్ధంబైన తత్కాలికవుల జానుకవితను బోలియుండునని తలంప నవకాశము లేదు. అవి యిప్పటి తుమ్మెదపదములు, కుచ్చలకథ, బొబ్బిలిపాట మొదలగు వానిని బోలియుండును. ఇప్పటి తుమ్మెదపదములు, స్త్రీలపాటలు మొదలగునవి యాంధ్రజాతీయ సంప్రదాయానుకూలములై వానికిఁ బట్టుకొమ్మలేవైనను నియమబద్ధములు కావను కారణమున శిష్టుల యాదరణము నెట్లు పొందలేకుండెనో, అట్లే యాకాలపు దేశి కవితయు సంస్కృత భాషాభిమానులగు శిష్టుల యాదరమును బొందలేక పోవుటచే, వ్రాతలోనికి దిగక జనుల ముఖవ్యవహారముననే పరంపరానుగతమై యుండి కాలక్రమమున నంతరించినను దాని స్వరూపచ్ఛాయమాత్ర మిటీవలి పాటలలో గొంతవఱకుఁ గనఁబడుచున్నది.

నన్నయకుఁ బూర్వకాలమునందు బయలుదేరిన దేశీయ కవితా ప్రవాహమందలి యొకపాయ మూలమూలలఁ బడి ముందుకు నెట్టుకొనుచు, మధ్యకాలమున నంతరించుచు మరలఁ బొడసూపుచు నిప్పటివఱకు నెట్లో ప్రవహించుచు వచ్చుచుండ, మఱియొకపాయ యా కాలముననే, దీనినుండి చీలి కొద్దికాలమే ప్రవహించి తుదకు నన్నయకాలమున బయలుదేరిన శిష్టకవితా మహాస్రవంతిలోఁ బడి యంతరించిన ట్లగపడుచున్నది. అదియె నన్నెచోడుడు కుమారసంభవమునఁ

బేర్కొన్న దుర్మార్గకవితయని తలంపఁగును. ఈ మార్గకవితను గూర్చి ప్రశంసించినవాఁడొక్క నన్నెచోడునివలెనే గనఁబడు చున్నాఁడు. "మును మార్గకవిత లోకంబున వెలయఁగ" అను పద్యమునుబట్టి దేశికవితకుఁ బూర్వము దేశమున వెలసి యున్నది సంస్కృత కవితయేగదా యనుతలంపుతో 'మార్గ' కవితయనఁగా సంస్కృత కవితయేయని తలంచినను, ఈతఁడు తరువాత—

"మార్గకు మార్గము దేశియ
మార్గము వదలంగఁ దమకు మదివదలక దు
ర్మార్గపదవర్తు లనఁదగు
మార్గవులం దలఁప నలఁతి మహి సుకవులకున్."

"అని దోషగ్రాహులగు కుకవివరాకులం బరిహరించిన" రీతిని బట్టి విచారింపఁగా నిందలి 'మార్గము వదలంగ దమకు మది వదలక దుర్మార్గపదవర్తులనదగు' మార్గ (మూరు) కవులు కేవల సంస్కృతభాషలో నుత్తమకవితను జెప్పినకవులు గారని తోచు చున్నది అట్టి సత్కవుల నింతకు బూర్వమే యీతఁడు సంస్తుతి చేసియే యున్నాఁడుగదా. చూడుడు :—

"సురవరులం గ్రమంబున వచోమణి సంహతిఁ బూజచేసి స
ద్గురు చరణారవిందములకుం దగ సన్నుతిఁజేసి కొల్చి వి
స్తరమతులం బురాణకవి సంఘము నుత్తమమార్గసత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతిఁజేసి మనోముదంబునన్."

ఇం దీతఁడు పురాణ కవి సంఘమును—అనఁగా వాల్మీకి వ్యాసాదులను, ఉత్తమమార్గ సత్కవీశ్వరులను—అనఁగా కాళిదాస భారవ్యుద్భట బాణాదులను, అనంతరము నామ

ముచేఁ బేర్కొనని దేశికవులను సంస్తుతిచేసియున్నాఁడు. ఈ పద్యమునఁ బేర్కొనిన కాళిదాస బాణాదుల నుత్తమమార్గ సత్కవీశ్వరులని చెప్పచు, నా వెంటనే "మార్గమువదలంగఁ (వగవంగ) దమకు మదివదలక, దుర్మార్గ=నుష్టమార్గ-పదవర్తు లనఁదగు మార్గకవులను" - కుకవివరాలకులని పరిహరింపఁ జూచుటచే, నన్నెచోడునిదృష్టిలో నా కాలమున మార్గకవులు రెండువిధములవారుగా నుండిరనుట స్పష్టమగుచున్నది. అందు మొదటివా రుత్తమమార్గ సత్కవీశ్వరులనుట నిశ్చయమే. రెండవ వా రెవరు? అని ప్రశ్న వా రెవరనఁగా, దేశభాష లలో కవితఁ జెప్పఁదలఁచియు సంస్కృతభాషయందలి యభిమానమునను దేశభాషలయందు గల నిరసనబుద్ధిచేతను నా "మార్గము" వదలుటకుఁ దమకు బుద్ధిపుట్టక, యా సంస్కృతముతోనే యించుక దేశ్యమును కలిపి కలగాపులగముచేసి, మలయాళభాషలో నొక ప్రత్యేక సంప్రదాయముగా నిలిచియున్న "మణిప్రవాళ" శైలివంటి భాషాశైలిలో రచింపఁగడంగిన సంస్కృతకవులై యుందురని తలంపనగును. కావుననే యిట్టివారు నన్నెచోడుని దృష్టిలో దుర్మార్గపదవర్తు లనదగు మార్గకవులైనారు! దుర్గార్గపదవర్తు లను పాఠాంతరము గ్రహించినను తాత్పర్యం మొక్కటియే యగును. కావుననే వీరును సంస్కృతమునే ప్రధానముగాఁ జేసికొని యందలి సుప్తిఙంతాది రూపములతో దేశభాషాపదములను మధ్యమధ్య చేర్చి పద్యరచన చేయుటచే-మార్గకవులే యని చెప్పవలసివచ్చినను, వీరు కాళిదాసాదులవలె నుత్తమమార్గ సత్కవీశ్వరులుగాక, దుర్గా(ర్మా)ర్గపదవర్తులనఁదగు' మార్గకవులైనారు. వీరుఁ'దేశి'కవులును

గారు; 'మార్గకవులలో' నుత్తములగు సత్కవీశ్వరులును గారు. ఉభయభ్రష్టులుగనుక నే "కుకవివరాకు" లయిరి.

కృత్యాదిని నన్నెచోడుఁడు త్రిమూర్తులను, రవిగణ నాథషణ్ముఖస్మరగజాతభారతు లగు సురవరులను వేర్వేఱ పూజచేసియు, జంగమ మల్లికార్జునగురు చరణారవిందములను దగ సమ్మతిఁజేసి కొల్చియు, వాల్మీకి వేదవ్యాసాది పురాణ కవిసంఘమును, కాళిదాసబాణాద్యుత్తమమార్గ సత్కవీశ్వరు లను గూడఁ బ్రత్యేకముగాఁ వేర్వేఱ సంస్తుతిచేసినవా డయ్యును; దేశిసత్కవుల నొక్కరినైనఁ బేర్కొనక యే యూరక సంస్తుతి మాత్రము చేసియున్నాఁడు. ఈకారణముచే నతఁ డిట్టి దేశికవులను బేర్కొనుచుఁ జెప్పినపద్యములు గ్రంథపాతముచే పోయినవని తలంచినవారు కొందఱు గలరు; కాని యాతనికాల మునఁ బైఁజెప్పిన యుత్తమమార్గ సత్కవీశ్వరులను బోలి యట్టి ప్రసిద్ధినిజెందినవారు దేశికవులలో లేకపోవుటచేతనే యాతఁడు పేర్కొనలేదేమో యను సందేహము కలుగక మానదు. నన్నె చోడుఁడు నన్నయకుఁ దరువాతికాలపువాఁడైనచో నాతని నెఱిఁగియుండఁడా? యను ప్రశ్న కలుగవచ్చునుకాని, యీతఁడు శైవమతాభిమాని యగుటచేతనో, లేదా రాజనరేంద్రుని యనంతరము కొంతకాలమువఱకు నన్నయ రచించిన భార తమున కంతగా వ్యాప్తి కలుగక యది రాజమందిరమున నొక మూలఁ బడి యుండుటచే నన్నయనుగూర్చి గాని, యాతని భారతమునుగూర్చిగాని దక్షిణదేశమున నున్న నన్నెచోడున కంతగాఁ దెలియకపోవుటచేతనో పేర్కొనకపోయి యుండును. కాని రాజమహేంద్రవరమున రాజనరేంద్రుని తరువాత

చాళుక్యులకును చోళులకును గలిగిన సంబంధమునుబట్టి యాతని ప్రోత్సాహమున జరిగిన భారతాంధ్రీకరణమునుగూర్చి యాతఁడు విని యుండునని మాత్రము మన మూహింపవచ్చును. కావుననే పురాణ కవిసంఘమునకుఁజెందిన వాల్మీకి వ్యాసులను, మార్గసత్కవులను ప్రత్యేకముగాఁ బేర్కొని దేశికవులవిషయమై చెప్పవలసి వచ్చినపుడు—

"మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవిత పుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జనచాళుక్యరాజు మొదలుగఁబలువుర్"

అని దేశికవిత అనఁగా దేశభాషలో శిష్టకవిత చాళుక్యరాజగు రాజనరేంద్రుని ప్రోత్సాహమున నాంధ్రదేశమున పొడసూపెనని చెప్పి,(?) యంతటితో నా ప్రసంగమును విడిచెను. కావున నుత్తమమార్గ సత్కవులగు కాళిదాసబాణాదులతో సమానముగాఁ బేర్కొనఁదగిన దేశిసత్కవుల నప్పటి కాత డెఱుఁగక పోవుటచేతనే ప్రత్యేకముగాఁ బేర్కొనలేదని తలంపఁదగి యున్నది. కాని ఇచ్చట చాళుక్యరాజుతో పాటు తెనుంగున దేశికవితను నిలిపిన పలువురెవరో ?

అట్లునుమార్గ సత్కవీశ్వరులతోపాటు దేశిసత్కవులను గూడ సంస్తుతించి, మర్గా(ర్మా)ర్గపదవస్తు లనఁదగు మార్గకవులం బరిహరించిన పిదప నూత్న రుచిరకావ్యములను రచించు రీతిని గూర్చి నన్నచోడుఁ డిట్లు చెప్పినాఁడు.

"సరళముగాగ భావములు
జానుఁదెనుంగుని నింపుపెంపుతో

బిరిగొన వర్ణనల్ ఫణితి
    పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగ బ్రాణముల్ మధుమ
    మత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ
    గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్.

సీ. మృదురీతి సూక్తులిం పొదవింప మేలిల్లు
    భావమ్ము నెలమి క్రీడావహముగ
నుఁగులఁ గన్నులు మిఱుమిట్లు వోవంగఁ
    గాంతి సుధాసూతికాంతిఁ జెనయ
వర్ణన లెల్లచో వర్ణనకెక్కంగ
    రసములు దలుకొత్తి జా(రా)లువార
దేశిమార్గంబులు దేశీయములుగా న
    లంకారములఁ దా నలంకరింప
నాదరించి విని సదర్థాతిశయమున
బుధులు నెమ్మనమున నిధులు నిలుప
వలవదే రచింప వరకవీశ్వరునకు
నూత్నరుచిర కావ్యరత్న వీథి.

ఈ పద్యములలోని యాలంకారికవిషయముల నటుంచి భాషా శైలివిషయమున మనము ప్రత్యేకముగా గ్రహింపఁదగిన విషయములు రెండు గలవు.

అందు సరళముగా భావములు "జానుదెనుఁగు"న నింపు పెంపుతోఁ బిరిగొనునట్లు రచింపవలయుననుట మొదటిది. "దేశిమార్గంబులు దేశీయములుగాన్" రచింపవలయు ననుట

రెండవది. వెనుక చాళుక్యులు దేశికవిత పుట్టించి యంధ్రవిషయ మునఁ దెనుఁగు నిలిపిరని చెప్పుచు, మార్గకవిత వదలలేని దుర్మార్గ పదవర్తులగు కుకవివరాకులను పరిహరించినట్లే, యిచ్చట రుచిర కావ్యరత్నములను రచించు మార్గమునుగూర్చి చెప్పుచు, దేశికవు లవలంబించిన జానుదెనుంగే యుపాదేయ మనియు, దేశిమార్గములను-అనగా- దేశ భాషాసంప్రదాయము లను, మార్గకవితాసంప్రదాయములను గలిపి-లేదా దేశ భాషను, సంస్కృతభాషను గలిపి-కవిత చెప్పునపుడు ఆ భాషను దేశీయముగనే చేయవలయును గాని, మార్గమును (సంస్కృత మును) వదలంగ మదివదలక, కొంత దేశ్యముతోఁ గూడిన సంస్కృతముగాఁ జేయుటయుక్తము కాదని సూచించినాఁడు. ఇచ్చట నితనియుద్దేశమిదియే యనియు. నీ దేశభాషలలో ముఖ్య ముగా నాంధ్రకన్నడములలో-నిప్పుడు మన మెఱింగిన శిష్ట భాషలో తొలికవిత బయలుదేరుటకుఁ బూర్వము తత్సమ ముగాఁజేయఁబడని సంస్కృతముతోఁ గుచ్చియెత్తినదేశభాషలో రచింపఁబడిన కవిత, మలయాళభాషయందలి మణిప్రవాళశైలిని బోలినది కొంత బయలుదేఱియుండుననియు, దానినుద్దేశించియే యాత డింతగాఁ జెప్పెననియు, మనము నిశ్చయింపవచ్చును. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున "జాత్యము గాని నొప్ప యిన సంస్కృతమెప్పుడు జొన్ప"నని ప్రతేకముగాఁ దెలుఁగు భాషలో తత్సమముగాఁ జేయఁడని సంస్కృతమును దీసికొనినచ్చి కలుపుట జాతీయము కాకపోవుటచే, తా నట్లెప్పుడును జొనుప దలంచుకొనలేదు-అని యొక ప్రతిజ్ఞగాఁ జెప్పుకొనుటనుఁ జూడఁగా నట్లు తెలుఁగుసంస్కృతములను జొనిపి కలగలిపి కవితఁ

జెప్పుసంప్రదాయ మొకటి యంతకుఁ బూర్వము దేశములో నొక కాలమునఁ బ్రచారము నుండెననియు, నట్టికలయిక యాతని కిష్టము లేక పోవుటచేతను, నంతకుఁ బూర్వమే యాంధ్రదేశమున దీనియం దనాదరము ప్రబలుటచేతను, దాని నాతఁడు పరిహరింపఁ దలంచి యట్లు చెప్పెననియు నూహింపఁదగియున్నది.

ఇక నన్నెచోడునికంటె పూర్వులగు కవు లెవరును దీని విషయము ప్రత్యేకముగాఁ జెప్పి యుండకపోవుటచే, నద్దానిని గూర్చి తెలిసికొనుట కాధారమేమియు లేకపోయినది. కాని రాజనరేంద్రుని ప్రోత్సాహమున నన్నయ భారతమును దెలుఁగింపఁ బూనినపుడా యాస్థానమందలి పండిత ప్రవరులతో నితనికి గలిగిన 'ఘోరరణముల'కు 'భారతాంధ్రీకరణమున నెట్టి భాష ప్రయోగింపనగును?' అను విషయము గూడ నొక కారణమై యుండవచ్చునని యూహింపఁదగును అచ్చటి పండితులలో బలువురు సంస్కృతమునం దభిమానము విశేషముగాఁ గలవారగుటచే, సంస్కృతముననే తెలుఁగు గలిపి మణిప్రవాళశైలిలో రచింపవలయునను వాదమును బయలుదేరదీసి యుండవచ్చును. కాని యీ విషయమున కన్నడ సంప్రదాయ సాదృశ్యమును జూపి, యాంధ్రమున నట్లే—దేశిమార్గములను - దేశీయముగనే చేసి—రచించుటయే యుక్తమని యచ్చటి పండితులను నచ్చజెప్పుటలో నారాయణభట్టు నన్నయకుఁ దోడ్పడి నిలిచియుండును. కన్నడభాషలో గూడ నిట్టి సంప్రదాయ మొకకాలమునఁ బ్రబలియుండఁగా, కన్నడకవులు నన్నయకుఁ బూర్వమే యీ విషయమును జర్చించి తత్సమభాషనే యవలంబింపవలయునని యనుశాసించి యట్లే రచింపఁదొడఁగినారు. ఈ విష

యము కన్నడభాషలో మొదటి లక్షణగ్రంథమగు 'కవిరాజ మార్గము' నందలి పీఠికాంశములను బరిశీలించినచో మనకు సువ్యక్తముకాఁగలదు. ఆంధ్రమున మొట్టమొదట లక్షణ గ్రంథమును రచించిన కేతనయు, దన 'యాంధ్రభాషా భూష ణము'న నీక్రింది సీసపద్యమున టీకకారుని "జాత్యముగాని నొప్పయిన సంస్కృతము నెప్పాను తెలుఁగునఁజొనుప"ఁ గూడ దను నభిప్రాయమునే, యనుశాసనరూపమునఁ దెలిపియున్నాఁడు.

" వృక్షేణ దక్షాయ పక్షిభిః పుత్రస్య
యను విభక్తులుదెనుంగునకుఁ జొరవు
అస్తి ప్రయాతి గాయంతి భుంక్తే సంతి
నయతి స్మరతి యను క్రియలు సొరవు
గత్వా హసిత్వా ప్రకాశ్య సంత్యజ్య నా
దనరు క్త్వాంత ల్యబంతములు సొరవు
గంతుం పురీం రిపుం హంతుం సుతం పాతు
మను తుమున్నంతంబు లరయఁ జొరవు
అపిచ తుహివై న వా నను లనఁగఁ బెక్కు
లవ్యయంబులు చొరవెందు నాంధ్రకవిత
పెరపదంబులతోడను దొరలి నిల్చు
నవి తెనుంగును గావింతు నభిమతముగ."

ఇట్టి సంస్కృతరూపములను దెలుఁగుతో నొక కాల మునఁ గలిపిచెప్ప నాచార ముండుటచేతనే, ఆ యాచార మును ఖండించుచు ననుశాసించుట కేతన కావశ్యకమైనది. మలయాళమున నిట్టి యనుశాసన మాదరింపఁబడక పోవుట చేతనే-అనఁగా సంస్కృతమునే ప్రధానముగాఁ జేసి దానితోఁ

గొన్ని మలయాళ పదములను జేర్చి చెప్పెడు నాచారము ప్రబలమగుట చేతనే—యందు మణిప్రవాళ మను శైలి ప్రత్యేకముగా నేర్పడుట తటస్థించినది. అట్టి శైలికుదాహరణముగా భాషా నైషధమందలి యీ క్రిందిపద్యము గ్రహింపనగును.

"ఞాన్ అజ్ఞు చన్నళవిలే పరిముచ్య గోష్ఠీం
నిద్రాచ్ఛలేన నిజవాసగృహం వ్రజంత్యాః
యన్మేలు మజ్జరయిలుం కుళిర్కొంగమేలుం
గూఢస్మితార్ద్రి ముడనే పతితః కటాక్షః"

ఞాన్ = నేను; అజ్ఞు = అక్కడకు, చన్నళవిలే = పోయినప్పుడే; గోష్ఠీం పరిముచ్య, నిద్రాచ్ఛలేన, నిజవాసగృహం, వ్రజంత్యాః, (తస్యాః) కటాక్షః, అజ్జరయిలుం=ఆ గదిలో, యన్మేలుం = నా పయినను, కుళిర్కొంగ మేలుం = చల్లని యామె స్తనములపైనను, ఉడనే = (తోడనే) వెంటనే, గూఢస్మితార్ద్రం యథాతథా, పతితః. అని యీ పద్యాన్వయము. ఈ వాక్యమునందలి కర్త, క్రియ, అన్వయము అంతయు సంస్కృతభాషా సంప్రదాయానుసారమే యై యున్నది. మధ్య కొన్ని పదములు మాత్రమే మలయాళ భాషకు సంబంధించినవి. "ఆ లేడీ నన్ను చూడడంతోనే ఫ్రెండ్సుతో కాన్వర్సేషన్ మానేసి నిద్రవస్తూందనే ప్రిటెక్స్టుమీద నన్నుచూచి నవ్వుతూ బెడ్‌రూమ్‌కేసి వెళ్లిపోయినది" "అను నిట్టిరీతి గిరీశం తెలుగును దలపించుచున్నది పై మళయాళ పద్యము. ఈ మణిప్రవాళ శైలిలో వ్రాయఁబడిన కావ్యము లనేకములు లిట్లే యున్నవి. కావుననే "భాషా

సంస్కృతయోర్యోగో మణిప్రవాళం" అని మలయాళలక్షణ గ్రంథములలో మొదటిదగు "లీలాతిలక" మీశైలిని నిర్వచించి దాని నంగీకరించుచున్నది. కన్నడాంధ్రదేశములలోఁ గూడ సంస్కృతభాషకును నార్యమతమునకును ప్రాబల్యము కలిగినను, అపభ్రంశములని తలంపఁబడిన దేశభాషలలో నుత్తమ కవిత రచింపఁగూడదను వాదము ప్రబలుటచే, నీ భాషల నొకవితా రచన చేయనొల్లని పండితు లాదికాలమున నిట్టిశైలినే యవలంబించినను, ఈదేశములలో మాత్ర మిట్టిరచన లంగీకరింపఁబడక పోవుటచే నివి వెంటనే యంతరించినవి కాని దీని స్వరూప మిట్టిదనియు, నీభాషలోఁ గూడ నొకప్పు డిట్టి రచన గలదనియు సూచించుటకో యన్నట్లు పాల్కురికి సోమన వృషాధిపశతకమున రెండుమూడు మచ్చుపద్యములను రచించి చూపియున్నాఁడు. అందొకదాని నిచ్చట బొందుపఱచుచున్నాను. సోమన వీనిని మచ్చునకుఁజూపినేగాని యీరీతికవిత తెలుఁగులో నుండెననుట కాధారము లేదని కొందరుతలంతురు. కాని అసలు సరకుండినఁగదా మచ్చు. అట్లయైనచో జానుదెనుఁగు, సంస్కృతము, కన్నడము మొదలగు వానియందుఁగూడ కవిత ఆ కాలమున లేదనవలసియుండును.

"అనయము జేతులందు భవ
దంఘ్రిసరోజయుగం నమామి నె
మ్మనమున సంస్మరామి యను
మాటల నిర్వరివస్కరో మ్యహా
మ్మనుచు మణిప్రవాళమున
నంకనసేయుదు భక్తలోక హృ

ధ్వనజ విహారలోల బస
వా బసవా బసవా వృషాధిపా.

నన్నెచోడాదులకు సుమారు రెండువందల యేండ్లకు బూర్వమున నట్టి శైలిని ఖండించి, కన్నడభాషలో సంస్కృతము గలిపి రచింపఁదగిన రీతిని గూర్చి నృపతుంగుఁడు తన 'కవిరాజమార్గము'న దెలిపియున్నాఁడు. అనఁగా తెలుఁగులో భారతమును నన్నయ రచింపనారంభించుటకుఁ బూర్వము రెండువందల యేండ్ల కాలముననే కన్నడభాషలో నీవాదము పరిష్కరింపఁబడుటయు, దాని ననుసరించి పంపాదులు గ్రంథముల రచించుచుటయు జరిగినదన్నమాట. కన్నడభాషలో నవలంబింపఁబడిన యీ పద్ధతినే, నారాయణభట్టు తోడ్పాటుతో నన్నయ రాజాస్థానమునందలి పండితులకు నచ్చఁజెప్పి, యనుసరించినవాఁడయ్యెను.

కవిరాజమార్గమునందలి పీఠికనుబట్టి విచారింపఁగా నప్పుడు రూపుమాసిపోయిన ప్రాచీనకావ్యములు - చౌపది, గీతిక, అక్కర, కందము మొదలగు పద్యములతోఁ గూడినవి 'చత్తాణం' 'బెదండె'యను పేరఁబరగునవి కొన్ని కలవనియు, నృపతుంగుని కాలమునకే 'పఱగన్నడమని' (ప్రాచీనకన్నడము) చెప్పఁబడఁదగిన భాషలో నవి రచింపఁబడియుండుననియుఁ దెలియవచ్చుచున్నది. ఈ పఱగన్నడము సంస్కృతభూయిష్ఠమగు శిష్టభాషవలె నాతని దృష్టిలో సుబోధకముగాని రసవంతముగాని, కాకుండుటచే నద్దానిని కావ్యములలోఁ బ్రయోగింపనెంచుట "జరద్వధూవిషయ సురత రస రసికత"ను బోలి "విరసం కర మవు" నని చెప్పి ప్రాచీన భాషాప్రయోగము

నీతఁడు నిరుత్సాహకుఁడినాఁడనియు నీ క్రింది పద్యమువలన స్పష్టమగుచున్నది

పఱగన్నడ స్వరూపం
పొసవిపతి గొ(ం)ద) నెవ్పే
ఆ్యడెయను వదెకటిసికబ్బిగర్ధాక్ (జె) నెయుం
(హిడవసమరె నిట్టి) సు గెం (?)
ముడిగెయ (ళ) మార్గెంగె నుడిన పఱగన్నడమం.
పఱగన్నడదనిందె
దొరకొండిరె సొగయిసుగుం
పురాణకావ్య ప్రయోగదొళ్ తతాంలం
విర (సం) కరమప్పు దేసిగె
జరద్వధూవిషయ సురతరస రసికతె వోల్.

కవిరాజమార్గము ౪౯, ౫౦.

ఇట్లు ప్రాచీన కన్నడభాషా ప్రయోగము విరసముగా నెంచ బడినపుడికఁ జేయఁదగినదేమి యను ప్రశ్నకు సమసంస్కృత మును మిశ్రముచేసి కావ్యములను రచింపవలయునని సమాధానము చెప్పినాఁడు!

సమసంస్కృత మిశ్రణాభ్యుపగమ.

"క॥ సమసంస్కృతంగళొ (ళ్ స)
(య్తు) మడ్తెరె కన్నడమునటికు పేర్గొంబుది దా
గమకోవిదనిగదితమా
ర్గమిదం బెరసల్కెమాగదీ సకెదదొళ్."

ఇట్లు సమసంస్కృతమునే దేశభాషలోఁ గలుపవలయును గాని కేవల సంస్కృత పదములను గలుపకూడదనుట ఆగమకోవిద

నిగదితమార్గమట. కన్నడభాషా వాక్యమునఁ బ్రయోగింపఁ గూడని సంస్కృతభాషారూపములను గొన్నిటి నీ క్రిందిపద్యముఁ దెలిపి వానికి లక్ష్యము నిచ్చియున్నాఁడు. అట్లు కలిపినచో గఱడియను మద్దెల నొక్కమారు వాయించుటవలనఁ గలుగు జర్ఘరధ్వని కలుగునట.

“ అహరహరుచ్చైరుచ్చై
ర్మ్నహుర్మ్నహురిత స్తతః పునఃపునరంత
ర్బహిరాదిహ ప్రాకురహో
సహసాదిగళవ్యయంగళసహాయంగళ్.
బెరసిరె కన్నడదొళ్ బం
ధురమాగదు కావ్యరచనె పేర్ద్దొడె పీనం
పరుషతరమక్కు మొత్తుం
గరడెయ మద్దళెయ జర్ఝరధ్వనిగళవోల్.”

కేవలావ్యయప్రయోగదోషక్కె లక్ష్యం.

“ బహిరంతరు పవనంగళో
ళహరహమా పరభృతంగళులివరవంగళ్
సహసాతళమళ గొళిసిను
పహోమనంగళ నితస్తతం విరహిగళా.”

సంస్కృతావ్యయ ప్రయోగదోష రాహిత్యప్రకార—

“ విదితసమసంస్కృతోదిత
పదంగళొళ్ పుదిదు బెరసిబరె కన్నడదొళ్
ముదమనవు తకుఁ ఞమతిశయ
మృదంగ సంగీతకాది మధురరవంబోల్.

ఇట్లు సమసంస్కృతముతోఁ గలిపి చెప్పినది మృదంగసంగీతకాది మధురరవమును బోలి యుండునదియు, నట్లుచేసిన కావ్యబంధ మనింద్యమై సొగసుగా నుండునదియుఁ జెప్పి పై దోష భూయిష్ఠ పద్యమును సంస్కరించి లక్ష్యము నిట్లు చూపుచున్నాఁడు.

నిర్దోషక్కె లక్ష్యం.

" బహిరుద్యానాంతరదొళ్
సహాసోదిత మత్త కోకిలోచ్చైర్ధ్వానం
ముహురాకర్ణిసె పడెద
త్తహర్నిశం పెర్చునంతరంగక్కెన్నా.
నెగర్దిర్ద కన్నడంగళొ
ళగణితగుణవిదిత సంస్కృతోక్త క్రమముం
బగెదొందుమాడి పేర్దొడె
సొగయిసుగుం కావ్యబంధమొందుమనింద్యం"

పిదప మిశ్రసమాసములు కూడ పరిహార్యములే యని చెప్పి లక్ష్యములను జూపినాఁడు.

" వఱసందా సక్కదముమ
నఱియదె కన్నడమునుం సమాసోక్తిగళొళ్
కుఱిసు బెరసిదొడె విరసం
మఱుగువ పాల్గళెయపనిగళం బెరసిదవోల్.
అరసకుమారన నాయత
తర కడెగణ్ణిం (దెనోడి) కెళదిన మేతం,
కరిగతనగెయ్దిద్దెఱం
గురునాణ్ఛరదింద మెఱగి ముఖదావరెయం."

సమాస నిర్ద్దోషకె లక్ష్యం.

“ నరపతితనయన నాయత
తరళాపాంగదొళై నోడి కెళదియరొడనాం
పరిగతహాస్య దొళి ర్ద్దాం
గురులజ్జాభరది వెఱగి ముఖసరసిజమం.”

‘అరసుకుమార, ఆయతతరళదెగణ్ణు, కెళదిసమేతం, ముఖదావరె’ మొదలగు మిశ్రసమాసములు ప్రయోగార్హములు గావని, యవి ‘నరపతితనయ, ఆయతతరళాపాంగ, కెళదియరొడనె, ముఖసరసిజ,’ అని యిట్లుండవలెననియుఁ దెలిపినాఁడు. ఇట్టి విషయములనే కేతనగూడ ఆంధ్రభాషాభూషణమున ‘వృత్తేణదత్తా యే’త్యాది పద్యములలో వ్యక్తముచేసి యుండుటను గ్రహించియుంటిమిగదా !

ఇట్టి కవిరాజమార్గపీఠికనుబట్టి చూడఁగా నన్నయకు సుమారు రెండువందల యేడ్లకుఁ బూర్వమే యా కాలమందలి శిష్టకవులు సర్వజనసామాన్యమగు దేశభాష నియమరహితం బగుటచేతనో ప్రాతవడ్డమాటలతోఁ గూడినదగుటచేతనో సంస్కృతమునెదుట నది వారికి రుచింపకపోవుటచేతనో, విరసంబైన భాషగాఁ దలంచి, యది శిష్టకవితారచనకనర్హంబని వదలివేసిరనియు, రాష్ట్రకూటచాళుక్యాది దేశీయ ప్రభువులు దేశిభాషలను ప్రోత్సహింపదలచినపు డీపండితకవులు దేశభాషా.పదములను సంస్కృతముతోఁ గలిపి యొకవిధమగు దేశికవితను రచింపదొడంగిరనియు, ఇట్టి కవితయు సర్వజనాదరణీయము కాకుండుటచే శిష్టులలోనే కొందఱు దీనిని ఖండించి సమసంస్కృతప్రయోగపద్ధతిని వాడుకలోనికిఁ దెచ్చిరనియు,

నిదియే కన్నడకవులచే నాదరింపఁబడియుండగా నన్నయాది తెలుఁగుకవులుకూడ నీ పద్ధతినే యాదరించి భారతాద్యుద్గ్రంథములను రచించుటచే నా మణిప్రవాళ కవిత కన్నడాంధ్రములలో నంతరించినను, మలయాళమున మాత్ర మేకారణముననో వాఙ్మయమున పాదుకొనియే యుండుట ఘటిల్లించినదని యుమనము నిశ్చయింపఁగదియున్నది.

ఇట్టి పద్ధతి నంతరింపఁజేసి పండితుల యాదరమును బడయఁగలుటకుగా నావి శిష్టకవయగు నన్నయ దేశ్యమును తగ్గించి మిక్కిలి తత్సమబహుళంబగు భాషలో భారతమును రచింపవలసినవాఁడయ్యెను. ఇట్లా యా దేశ కాలపరిస్థితులను బట్టి యాయా భాషావాఙ్మయములందలి రచనాపద్ధతులకును, వాఙ్మయ స్వరూపములకును గల సంబంధమును వినుతింపవలసి వచ్చినపుడు సన్నిహిత భాషల స్థితిగతులను వాని సంప్రదాయములను దెలిసికొనవలసిన యావశ్యకత యెంతేనియు గలుగుచుండును.

---

## ఆంధ్రవాఙ్మయచరిత్రము : యుగవిభజనము

ఆంధ్రవాఙ్మయచరిత్రము దెలుపు గ్రంథము లిదివఱకే కొన్ని బయలుదేరియున్నవి. వానిని రచించినవారిలోఁ బలువురావాఙ్మయమును వారివారి యుద్దేశములను బట్టి, సౌకర్యమును బట్టి పలువిధములుగ విభజించి దాని చరిత్రను దెలుపఁ దొడంగిరి. ఈ కారణముచే నాంధ్రవాఙ్మయమునందలి యుగ విభజనవిషయమున నభిప్రాయభేదము లేర్పడుటయు.

నది. కావున నీ వాఙ్మయమున యుగవిభజనము చేయురీతిని గూర్చి యించుక పరిశీలింతము

మొట్టమొదట నీ భాషలో బయలుదేరినవి కవులచరిత్రలేగాని వాఙ్మయచరిత్రలు కావు. వీనికైనను మొదట దారి తీసినవారు కందుకూరి వీరేశలింగంపంతులుగారు. ఈయన తానురచించిన గ్రంథమునకు 'ఆంధ్రకవుల చరిత్ర' మని నామకరణము చేసెను. ఆ నామమున కనుగుణముగా నది ఆంధ్రకవుల చరిత్రమని చెప్పఁదగియుండెనే గాని ఆంధ్రవాఙ్మయచరిత్రమని చెప్పఁదగదు. అం దాయన సాధ్యమైనంతవఱకు కాలానుగుణముగా నొక్కొకకవినే గ్రహించి యాతని పుట్టుపూర్వోత్తరములను దెలుపుచు నాతఁడు రచించిన గ్రంథములనుబట్టి, దానిని కృతినొందిన రాజులు మంత్రులు మొదలగువారినిబట్టి, యితరకవులు వీనినిగూర్చి చేసిన ప్రశంసాదికమును బట్టి ఇంకను దొరకినపుడెల్ల శాసనాదుల సాక్ష్యమును బట్టియు, నాయా కవుల కాలమును, నిర్ణయించుచు నా కవి రచించిన గ్రంథములనుబట్టి యాతని కవితావిశేషములను దెలుపుచు, నింక వానినిగూర్చిన చారిత్రకవిషయములను వాడుకకథలు మొదలగువానిని జేర్చి, కవులను వారిచరిత్రమునే ప్రధానముగఁ దన దృష్టిపథమునఁ బెట్టుకొని యీ గ్రంథమును రచించెను. అట్లు రచించి సిద్ధమైనంతవఱకు గ్రంథమును ప్రచురించుటకు వీలుగా నాతఁడా కవులను, తన గ్రంథమును గూడ మూఁడుభాగములుగఁ జేసెను. కావున ప్రాచీనకవులు, మధ్యయుగపు కవులు, ఆధునికకవులు నని కవులు మూఁడు తెగలైరి. గ్రంథమును మూఁడుభాగములు గలదయ్యెను. కావున

నీ విభాగము కవులనుబట్టియు, వారి చరిత్రను రచించువారి సౌకర్యమును బట్టియు నేర్పడిన విభాగముగాని వాఙ్మయ చరిత్రకు సంబంధించిన విభాగముకాదనుట స్పష్టము.

'కవిజీవితము'లను రచించిన శ్రీగురుజాడ శ్రీరామ మూర్తిపంతులుగారు మఱియొక పద్ధతి నవలంబించిరి. వీరు కవుల కాలమునుబట్టియైనను విభాగము చేయఁదలంపలేదు. ఆయా కవులు రచించిన గ్రంథములనుబట్టి భారతకవులని, రామాయణకవులని, ప్రబంధకవులని విభాగమును జేసిరి. ఈ విభాగముకూడ కవులనుబట్టి చేసినదేగాని విశేష మేమనఁగా నిది కవుల కాలమునుబట్టియైన నేర్పడిన విభాగము గాక యేవో కొన్ని సంస్కృత గ్రంథముల నాంధ్రీకరించిన కవుల నొక్కొక గుంపుగాఁ జేర్చుటచే నేర్పడిన విభాగము. ఇట్లికవిచరిత్ర కవి జీవితకారుల దృష్టిని గాఢముగ నాకర్షించినది ఆంధ్రకవులు గాని, యాంధ్రవాఙ్మయము కాదు. కావుననే యీ విభాగము లాంధ్రవాఙ్మయ పరిణామమునందలి, లేదా వాఙ్మయచరిత్రము నందలి దృష్టితోఁ జేయబడినవి కాకపోవుట తటస్థించినది. అయితే ఆంధ్రకవుల జీవితచరిత్రమును వారు రచించిన గ్రంథ ములనుగూర్చిన విమర్శనముగల గ్రంథమునే ఆంధ్రవాఙ్మయ చరిత్రము కాదన్న చో నాంధ్రవాఙ్మయచరిత్రమనున దింకేద్ది? వీనికంటె నది భిన్నమై యుండునా? యను ప్రశ్నగలుగక మానదు. కవులచరిత్రముగాని కవుల జీవితచరిత్రముగాని వాఙ్మయచరిత్రమునకు సహాయకారులేగాని, వాఙ్మయచరిత్ర మెన్నటికి గావనుటయే యద్దానికి సమాధానము. అయితే కవుల చరిత్రము వారిగ్రంథములను గూర్చిన విమర్శనము

లేనిదే వాఙ్మయచరిత్రమునందొకటి స్వయముగ సృజింపఁబడుచున్నదని దీని యర్థము కాదు. సజీవంబగుటచే నాయాకాలములందు కలుగు మార్పులకు లోనై కాలక్రమమున నభివృద్ధి నొందుచున్న యొక జీవద్భాషకు, ఆయా కాలముల యందేర్పడిన వ్యాకరణములు లా భాషాచరిత్రను దెలుపుటకెట్లు సాహాయ్యకారులగుచున్నవో అట్లే యాయాకాలములందలి కవులయొక్కయు వారి గ్రంథములయొక్కయు చరిత్రములు లా వాఙ్మయ చరిత్ర రచనమునకుఁ దోడ్పడుచుండును. ఒకానొకకాలమునం దొకభాషలో కవులు రచించిన కావ్యములే యా భాషావాఙ్మయ కథాసౌధమునకు ప్రధానపరికరములు. ఈ పరికరములు లేకయే యా సౌధనిర్మాణము కాదనుట స్పష్టమే. కాని యీ పరికరములలో నొకానొకదానిని గ్రహించి దాని సౌందర్యమును, దాని సౌష్ఠవమును, దాని నిర్మాణపద్ధతిని గూర్చి పరిశీలించి యానందించుట యనున దొక పద్ధతి. ఆయా పరికరములతో నాసౌధమును నిర్మాణముచేసి, యేది యెట్లిచ్చట నమరినదో దానివలన నా సౌధమున కెట్టి సొంపు సంపాదింపఁబడినదో దానియం దమరుటంజేసి దీని సహజగుణం బెట్లు ప్రకాశించుచున్నదో, ప్రత్యేక మొక్కొక్కటిగా గ్రహించి పరిశీలించి నప్పటికంటె నింక పెక్కు లగు సదృశవస్తువులతోఁ జేరి యా సౌధంబున నర్హస్థానంబున నమరి యున్నయప్పుడా యా వస్తువుల రామణీయకంబు నందలి తారతమ్యము లెట్లు వ్యక్తంబగుచుండునో, ఒకయంతస్తుపై మఱియొక యంత స్తైవిధముగా కట్టబడి నిలిచియున్నదో, పై దానికి క్రింది దెంతవఱకు మూలకము, పోషకము నగు

చున్నదో, పైకి పోయిన కొలది క్రొత్త క్రొత్త - వింత వింత నగిషీలు, చమత్కారపు చెక్కడములు, కన్నుల మిఱుమిట్లు గొల్పు మెఱుంగుపూతలు నెట్లుగా బయలుదేరి చూపరుల నాశ్చర్యమగ్నులను జేయుచుండునో అను విషయములు గమనించుట, అనఁగా ముఖ్యముగా విడివిడిగాఁ దెచ్చి పెట్టఁబడిన యీ పరికరములకును, వానిచేఁ గట్టఁబడి వెలసిన యీ రమ్య సౌధమునకుఁ గల సంబంధ మెట్టిదో కనిపెట్టుట రెండవపద్ధతి. అట్టి మహాసౌధమును కొద్దిదూరమున నిలువంబడి క్రిందినుండి పైవఱకు పాఱఁజూచి దాని యద్భుతరామణీయకంబునకు నివ్వెఱపాటుఁ జెందవచ్చును. లేదా లోనఁ బ్రవేశించి క్రింది యంతరవునుండి క్రమక్రమముగా నమర్పఁబడిన మెట్లమూలమున తుదివఱకుఁ బ్రతియంతస్తుమీదికి నెక్కి యందమర్పఁ బడిన వస్తుసౌభాగ్యము పరిశీలించి పరమానందపరవశులు గావచ్చును. మొదటిదానికంటెను రెండవది, అనఁగా నా సౌధనిర్మాణమునకుగాఁ దెచ్చిపెట్టిన పరికరములఁ బరిశీలించి యానందించుటకంటెను, వానిచే నిర్మింపఁబడిన యీ సౌధసౌభాగ్యమును దిలకించి యానందించుట పరమోత్తమ మనుటకు సందేహము లేదు గదా.

ఆంధ్రకవుల జీవితములు, వారి కాలనిర్ణయమును గూర్చిన చర్చలు, ప్రత్యేక గ్రంథములనుగూర్చిన విమర్శనములు మొదలగునవన్నియు నాంధ్రవాఙ్మయ సౌధనిర్మాణమునకు వలయు పరికరములే. అవి లేక సౌధ నిర్మాణము సాగదు. ఈ సౌధము సులభముగా మూలమును త్రవ్వితీయుట కలవడని కొండప్రదేశముపై వేయఁబడిన పునాదిపైఁ గట్టఁబడినదికాక

సంస్కృతవాఙ్మయంబను సముద్రప్రదేశమునఁ దీర్చి త్రవ్వి చక్కఁగాఁ గట్టఁబడిన పునాదిపై నిర్మింపఁబడినది. కావుననే తీర్చి సమముగఁజెక్కఁబడి యమర్పఁబడిన పలుకురాళ్లు పునాది నుండియు మనకగపడుచుండుట. ఈ పునాదిక్రింద ప్రాచీన కాలపు మూలకట్టడం బేమైన నున్నదేమో, యే ప్రక్కనుండి యైనను పురాణవస్తు తత్వశోధకులు త్రవ్వి చూచి తెలిసికొన వలసినదే కాని, బయటినుండి తెలిసికొనగలిగినంతవఱ కేమియు నగపడుట లేదు. పునాదియేగాక యీ వాఙ్మయ సౌధము యొక్క తొలిగృహభాగమంతయు నా సంస్కృత వాఙ్మయ సౌధమునుండి యేరి తెచ్చి పైని కొంత నగిషీపనిమాత్రము చేయఁబడిన రాళ్లతోడనే కట్టఁబడినదని చెప్పక తప్పదు. ఈ నగిషీపనిమూలముగా నీ క్రిందిగృహమునఁగూడ నతి రమ్యములగు నద్భుతశాలలు కొన్ని యేర్పడియే యున్నవి. ఇట్టి చిత్రశాలలలో నొక దానినుండి వేయఁబడిన సోపానమార్గ మొకటి పై యంతస్తులోనికి మనలను దీసికొనిపోవును. ఇచ్చటనే యాంధ్ర కవితా శిల్పము యొక్క స్వతంత్ర వ్యక్తిత్వము, నద్భుతరామణీయకము ప్రకటింపఁగలిగిన ప్రబంధశిఖర మొకటి వెలయుచు, దూరమునుండి చూచువారి కన్నులకు మిఱుమిట్లు గొల్పుచుండును. వెనుకభాగమున దీని నంటియే కొన్ని గద్యగృహములు, నాటకశాలలు నిర్మింపఁబడియున్నవి. దీనిపై మఱియొక యంతస్తు నూతనముగా కట్టఁబడుచున్నది. అందు విచిత్రశాలలనేకములు గలవు గాని శిఖరము లింక తీర్చి కట్టఁబడి యుండలేదు. నగిషీపని యంతయు తయారుకాలేదు. పని పూర్తియగు నప్పటి కీ యంతస్తు వెనుకటిదానికంటె నత్యంతశోభాయ

మానంబై దివ్యతేజంబుతో వెలుంగుచుండు ననుటకు సందే
హము లేదు. క్రిందివానికంటె నిది మిగుల నెత్తయినదే గాక
దీనిని జేర్చు మెట్లు క్రిందిదాని మెట్లవలె తీర్చి కట్టఁబడినవిగాక,
యయోమయములై వలయాకారమున సూటిగఁ బైకి పోవు
నవై యున్నవి.

ఇట్టి యాంధ్రవాఙ్మయసౌధమును దిలకించినచో రెండు
పై యంతస్తులు, నొక క్రిందిగృహము, నొకదానినుండి మఱి
యొకదానికిఁ గొనిపోవు రెండు సోపానమార్గములు నగపడు
చున్నట్లున్నది. దీనినిబట్టియే వాఙ్మయయుగములనుగూడ
మనము విభజింపవచ్చునని తోచకపోదు. అట్లు చేసినచో
ప్రధానములగు వాఙ్మయ యుగములు మూడే కనఁబడుచున్న
వనియు, వీనిమధ్య సోపానమార్గములవంటి సంధియుగములను
రెంటిని జేర్చినఁ జేర్చుకొనవచ్చు ననియుఁ జెప్పవచ్చును. దీనిని
బట్టియే యాంధ్రవాఙ్మయయుగములను మన మేర్పరచి
కొన్నచో నవి పంచసంఖ్యాకము లై యుండునని తోచును.

అయితే యీ వాఙ్మయము నన్నపార్యుఁడు భారతము
నాంధ్రీకరించుటతోఁగదా ప్రారంభింపఁబడినట్లు గ్రహింపఁబడు
చున్నది. ఈతనికిఁబూర్వ మద్దాని స్థితి సులభముగఁ బై కేమియు
గోచరించుట లేదు. వలసినచో పునాదిక్రిందిభాగమున నచ్చ
టచ్చట త్రవ్వి చూచి దానిస్థితి గనిపెట్టవలసియుండుటచే, నీ
వాఙ్మయముయొక్క ప్రాథమికావస్థను దెలుపు కాలమును మఱి
యొక యుగముగా గ్రహింపవచ్చును. అప్పుడారు యుగము
లగును. ఈ తొలియుగమునుగూర్చి మనకిప్పటి కంత విశేష
ముగాఁ దెలియదు గావున దీనికి 'అజ్ఞాతయుగము' అని నామ

కిరణము చేయవచ్చును. లేదా "ప్రాఙ్నన్న పూర్వయుగ" మనియుఁ జెప్పవచ్చును. ఇక నన్నయాదులు రచించిన భారత భాగవత రామాయణాదు లాంధ్రమున బయలుదేరిన యుగము నేపేరున బిలువవలయు నని ప్రశ్న. పురాణయుగ మని కొందఱు పేర్కొనియుండిరి గదా. వారట్లు చేయుటకుఁ గారణమేమై యుండు ననఁగా నిం దేవో కొన్ని ప్రసిద్ధములగు పురాణములు తెలుగులోఁ రచింపఁబడియుండుటయే కావచ్చును. ప్రధాన యుగమని నిష్కర్షగాఁ జెప్పఁదగియున్న తరువాతి యుగము నందుఁ గూడ నేవో కొన్ని పురాణములు తెనిఁగింపఁబడి యుండెనే, యిటీవలఁ గూడ మరికొన్ని తెనిగింపఁబడుచునే యున్నవే, అట్టి సందర్భములోఁ దొలియుగమునే పురాణముగ మనుటయేల, అది యెట్లు సమంజసమగునని కొందరన వచ్చును. ఏ యుగమునకుఁ గాని మనము పేరుపెట్టునపుడు దానియందలి ప్రధానలక్షణములను గమనించి పెట్టుదుము గావున 'ఛత్రిణో గచ్ఛంతి' యనుదానివలె లక్షణచే గ్రహింపఁ దగునేగాని, యంత మాత్రమున ఇతరవిశేషలక్షణము లేవియు లేవని చెప్పుట యని తలంపఁజనదు గదా! అకారణముచే తొలియుగమున నొకటి రెండు ప్రబంధములుగాని శతకములు గాని రచింపఁబడియున్నను మలియుగమున నొకటి రెండు పురాణములు భాషాంతరీకరింపఁబడియున్నను, మనపూర్వ సంకేత నామములను మార్చవలసిన యావశ్యకత యేర్పడదు. ఆ యా కాలములందు సాహిత్యసంచలన మెద్దానియందు కేంద్రీకృతంబగు చుండునో దానినిబట్టి యుగనామ మేర్పడుట న్యాయ్యము. కాని యీ యుగముల కీ నామములు సార్థకములై యుండెనాయను

విషయమున నభిప్రాయభేదము గలుగవచ్చును. పురాణయుగ మునకాపేరీ వాఙ్మయమున నది ప్రాచీనమైనదగుటచేఁ గలిగెనా, లేదా పురాణము లాకాలమున రచింపఁబడుటచేఁ గలిగెనా యను సందేహమును కలుగవచ్చును. ప్రాచీనయుగమను నర్థమున నెవ్వారును బ్రయోగించి యుండరనియే నా తలంపు. పురాణములు రచింపఁబడుటను బట్టియే యా పేరు దానికిఁ గలిగిన దనుట నిశ్చయము. ఆ కాలమునందే మఱికొన్ని యితిహాసములు, కొన్ని కావ్యములు, కొన్ని శాస్త్రగ్రంథములు మొదలగునవి గూడ నాంధ్రమున వెలసినవి; వీనిలోఁ బ్రధానములుగా గ్రహింపఁబడినవి పురాణములు గావుననే యీ యుగమున కా పేరు వచ్చినదని చెప్పినను చెప్పవచ్చును. కాని యాంధ్రవాఙ్మయమునందలి యీ యుగమును పురాణయుగ మనుటకంటె భాషాంతరీకరణయుగ మనుట సమంజసమని తోఁచెడిని. ఏల యనఁగా నీ యుగమున నీ భాషలో రచింపఁబడిన గ్రంథము లన్నియు—నవి యితిహాసములుగానీ, పురాణములుగానీ కావ్యములుగానీ, యేవైనను సంస్కృతగ్రంథముల పరివర్తనములే. ఇం దుత్కృష్టమగు స్థానమును వహించిన భారత మితిహాసము. భాస్కర తిక్కనాదుల రచనలకు మూలంబగు రామాయణ మాదికావ్యము. మంచన కేయూరబాహుచరిత్రమునకు మూలంబగు 'విద్ధసాలభంజిక' యొక నాటకము. కేతన దశకుమార చరితమునకు మూల మొక గద్యకావ్యము. ఇవి యన్నియుఁ దక్కిన భాగవత నృసింహపురాణాదులవలె భాషాంతరీకరణములే యగుటచే, వీని యన్నిటియందును వర్తించు శబ్దముచేతనే యీ యుగమును బేర్కొనుట యుత్తమము. ఈ

సంకేతమును దాటిపోవు గ్రంథములును లేకపోలేదు. కాని యవి యొకటి రెండు మాత్రమే. ఆరూఢ గద్యపద్యాది ప్రబంధపూరిత సంస్కృత భూయిష్ఠరచన మానుగా సర్వసామాన్యంబు గాకుండుట చేతను జానుదెనుఁగు ప్రసన్నతకు విశేషంబగుటచేతను, జానుదెనుఁగున దేశీయచ్ఛందము లగుద్విపదాదులలో దేశికవిత రచింపవలయు నని వాదించిన పాలకురికి సోమనాథాదుల కృతులగు బసవపురాణ పండితారాధ్య చరిత్రాదు లుండిన నుండుఁగాక. వారి వాదము వెనుకటి జీర్ణపద్ధతిని సూచించుచు నా కాలమున నరణ్యరోదనమే యైనది. సంస్కృత గ్రంథముల పరివర్తనములుగాక సంస్కృతవాఙ్మయ సంబంధముగాని, సంస్కృతవస్తు సంబంధముగాని విశేషముగా లేకయే రచింపఁబడిన యాంధ్రకృతులు తరువాతి ప్రబంధయుగమునఁ గూడ నంతగాఁ గానరావు. కావున నీ యుగసామాన్య లక్షణములకు లొంగని విశేష కృతులనుగా వీనిని గ్రహించి పరిశీలింపవలసినదే. ఇట్టి వా యా యుగములందు కొన్ని బయలుదేరుచుండుటయుఁ గలదు. ప్రబంధయుగమునందలి పింగళి సూరనార్యుని 'కళాపూర్ణోదయ' కృతి యా యుగమునం దసాధారణమైన రచనం బనియే చెప్పవలసియున్నది గదా. కాని సోమనాథుఁడు మాత్రము తన గ్రంథములలో నొకదాని కా యుగధర్మము నతిక్రమింపలేక గాబోలు పురాణంబనియే నామకరణమొనరించినాఁడు. సామాన్యముగా నెవ్వండైన నసమానప్రతిభావంతు డయినగాని, లేదా ప్రత్యేకకారణము లేవో కలిగిన కాని తన పరిసరపరిస్థితులను యుగధర్మములను నతిక్రమించి ప్రవర్తింపగలిగి యుండడు. అట్టి ప్రతభావంతుఁ డొకొ్కకప్పుడు

నూతన యుగకర్తగాఁగూడఁ బరిగణింపఁబడుచుండును. మొత్తము
నఁ బురాణయుగమని చెప్పఁబడుచున్న యీ రెండవ యుగము
నందు తెనుఁగుచేయఁబడినవి నృసింహపురాణము, హరివంశము,
మార్కండేయపురాణము, పద్మపురాణము, భాగవతము అయి
దారు పురాణములు మాత్రమే కనఁబడుచుండుట చేతను
పురాణశబ్దవాచ్యములుకాని తక్కిన యుగ్రంథములు వీనితో
సమానమైనవిగనే యుండుటం జేసియు, నివియన్నియుఁగూడ
పరివర్తనములనిచెప్పుట కభ్యంతర మేమియు లేకుండుటవల
నను, ఈ యుగమును భాషాంతరీకరణయుగ మనుటయే
యుక్తముగాఁ గనఁబడుచున్నది. మఱియు నీ గ్రంథము లీ
భాషలోఁగూడ సంస్కృతభాషలో రచింపఁబడినప్పటి నామ
ములతోడనే వ్యవహరింపఁబడుచుండెనుగాని, నామమాత్ర
విషయముననైన భేద మేమియు లేదుగదా! భాషాంతరీకృత
గ్రంథములన్నియు నట్లు వాని తొలినామములతోడ వ్యవహ
రింపఁదగినవేయై యుండును. భారతము, రామాయణము, దశ
కుమారచరితము, హరివంశము మొదలగు గ్రంథముల పేళ్లు
చెప్పినంతనే, యవి సంస్కృతగ్రంథము లనియే మొదట స్ఫురిం
చునుగాని, భాషాంతరీకృత గ్రంథములని ప్రత్యేకముగా
స్ఫోరకసందర్భము లేమైన నున్నగాని, మనము తలంచుట కవ
కాశము లేదు. పరివర్తితగ్రంథమని సూచించుటకుగానాంధ్ర
భారతమనియో, ఆంధ్ర దశకుమారచరితమనియో చెప్పవలసి
యుండును. అట్లు చెప్పినను మూలము తెలుఁగుగాదనియు, నిది
కేవల భాషాంతరీకృతగ్రంథమే యనియు స్పష్టమగుచునే
యుండును. ఇట్లు వీనిని స్వతంత్రము లగు నాంధ్రగ్రంథము

లచట కీట్టి చిక్కు లుండుటచే నట్టి గ్రంధములు బయలుదేరిన కాలమును భాషాంతరీకరణయుగమనుటయె లెస్స.

అయితే యవి భాషాంతరీకరణము లనినంతమాత్రమున వీనియందలి విశేషగుణములను గమనింపక మఱుగుపఱచుచున్నామని తలంపఁగూడదు. భాషాంతరీ కరణ మనునది ఈ యుగధర్మముయొక్క సామాన్య చిహ్నమని సూచించుటయే దీని కిట్లు నామకరణము చేయుటలోఁగల విశేషము. ఇక తరువాతఁ జేయవలసిన పనియేమనగా నా యా కాల పరిస్థితులను బట్టి భాషాంతరీకరణము మాత్రముతోఁ బ్రారంభింపఁబడినదని చెప్పఁబడుచున్న ఈ యాంధ్ర వాఙ్మయమున నెట్లెప్పుడే విధముగా నాంధ్రజాతీయతను, నాంధ్రవ్యక్తిత్వమును బయలుపఱచు స్వతంత్ర గ్రంథములు బయలుదేరినవి. అవి యెట్లు వాఙ్మయ పోషకములై దానిని నిలునఁబెట్టినవి, ఈ భాషాంతరీకరణము లెట్లు అ స్వతంత్రాంధ్ర గ్రంథరూప వాఙ్మయ ప్రాదుర్భావమునకు దారితీసి తోడ్పడినవి యను విషయములను బరిశీలించి నిర్ణయించుటయే యై యున్నది. పేరుకొఱకా యింత పీకులాట యని యాక్షేపింపవచ్చును. కాని, దశకుమార చరితము, విక్రమార్కచరితము, భారతము, హరివంశము అనుటతోడనే, తెలుఁగా, సంస్కృతమా యని కలుగు సందేహము, హరవిలాసము, మనుచరిత్ర, ఆముక్తమాల్యద, ప్రభావతీ ప్రద్యుమ్నము, పారిజాతాపహరణము, కళాపూర్ణోదయము అనువానిని బేర్కొనినప్పుడు కలుగుట కవకాశము లేదుగదా! వీనియందలి కథలన్నియుఁగూడ సంస్కృత పురాణముల నుండియో, కావ్యములనుండియో గ్రహింపఁబడినవె యై

యుండవచ్చును. కథలే యననేల, భావములు, వర్ణనలుగూడ గ్రహింపఁబడియే యుండును. ఐనను ఆ కథలనే, ఆ భావములనే యీ కవులు చేపట్టితీర్చిన రీతిలోనే, ఆసన్ని వేశకల్పనము (Setting) లోనే వీరి యాంధ్రత్వము వ్యక్తిత్వము వెల్లడియైన వనుటకు సందేహము లేదుగదా. కావుననె యీ యాంధ్ర ప్రబంధ మనునది భాషాంతరీకరణయుగ మహావృక్షముయొక్క స్వాదుఫలమని చెప్పక తప్పకున్నది. ఈ కారణముచే నీ వాఙ్మయమందలి తరువాతి ప్రధానయుగము ప్రబంధయుగ మని తనంతన యేర్పడుచునే యున్నది గదా?

అయితే యీ భాషాంతరీకరణవృక్ష మేరీతిగా పెరిగి పరిణతినొంది యీ ప్రబంధఫలమును గన్నదో, యద్దాని పరిణామక్రమ మెట్టిదో తెలిసికొనవలయు నన్నచో, కేవల భాషాంతరీకరణ స్థితికిని, పరిణత ప్రబంధస్థితికినిగల యవాంతర సంబంధమును పరిశీలింపవలసి యుండును. అట్టి పరిశీలన కనువగు నట్లుగా నీ పరిణామక్రమమును సూచించు కాలము నీ రెంటి నడుమనున్న యొక సంధియుగముగా గ్రహించినచో వాఙ్మయ పరిణామక్రమ పరిశోధనకు సౌకర్యం బలవడును. దీనిని సంధి యుగ మనుటయే యుక్తంబైనను ఈ వాఙ్మయ పరిణామక్రమ మును పెంపొందించిన శ్రీనాథకవి యీ కాలమున నత్యంత ప్రసిద్ధుఁడై యాంధ్రవాఙ్మయ ప్రపంచము సర్వము దానయైనట్లు నెగడిన మహా పురుషుఁడగుటచే నీ సంధియుగము నాతని పేర శ్రీనాథ యుగమనియుఁ జెప్పినఁ జెప్పవచ్చును.

వాఙ్మయ యుగములను తత్పరిణామక్రమమునందలి విశేష లక్షణములచేతనే కాక, ఆ యా కాలములం దాపరిణా

మమునకుఁ దోడ్పడుచుఁ బ్రసిద్ధులై యుగపురుషు లనఁదగిన మహాకవుల నామములచేఁగూడ చెప్పుచుండుటయుఁ గలదు. కావుననె ఆంగ్ల వాఙ్మయమున ఛాసర్ యుగమనియు, షేక్స్పియర్ యుగమనియు, టెనిసన్ యుగమనియు వాఙ్మయ యుగము లేర్పఱుపఁబడియున్నవి. ఇదియు నొక పద్ధతియై యున్నది. ఈపద్ధతి ననుసరించి భాషాంతరీకరణయుగమును కవిత్రయ యుగమనియుఁ జెప్పినఁ జెప్పవచ్చును. నన్నయార్యుఁడు ప్రారంభించిన భారతేతిహాస మూలకమగు భాషాంతరీకరణోద్యమమును తిక్కనార్యుఁడు తననిర్వచన రచనచేతను ప్రబంధ మండలీ బంధంబులచేతను, ప్రబంధపరమేశ్వరుఁడు తనయుక్తి వైచిత్ర్యంబులను, నాచనసోముఁడు పురాణ భాగ రచనమందు చేసిన తన నవీనగుణప్రదర్శనముచేతను, మంచన జక్కనాదులు సంస్కృత నాటకాదులయందలి కథల నాంధ్ర కావ్యములుగ రచించుటచేతను, గౌరన ప్రత్యేకపౌరాణిక చారిత్రక కథలను ద్విపదముల నడిపించుటచేతను, శ్రీనాథుఁడు తన ఖండకావ్యములచేతనేకాక హరవిలాసాదులందుఁ జూపిన 'మాలకారి' ప్రజ్ఞావిశేషముచేతను తరువాతి ప్రబంధయుగమునకు దారితీసి, వాఙ్మయ పరిణామమునకు ఎట్లు తోడ్పడిరో, భాషాంతరీకరణోద్యమము స్వతంత్రాంధ్ర ప్రబంధ నిర్మాణమున కెట్లు దారి తీసినదో యను విషయములను సంధియుగంబగు శ్రీనాథ యుగచరిత్రమునకుఁ దెలుపవలసియున్నది. నాల్గవదియగు నీ ప్రబంధయుగమును రాయలయుగమని చెప్పినను జెప్ప వచ్చును. తాను స్వతంత్రముగ ప్రబంధరచనమునకు దారితీసి,

యనేక కవుల నట్టి రచనలకుఁ బ్రోత్సహించిన భాషాపోషకుం డగు నాతఁ డాయుగకర్తయనుటకు సందేహము లేదు. అతని తరువాతి యిటీవలికాలమువఱకుఁగూడ నా ప్రబంధరచన గతానుగతికముగ నేదో విధముగ సాగుచునే యుండుటచే ౧౭-వ శతాబ్దినుండి ౨౦-వ శతాబ్ద్యారంభము వఱకు ప్రబంధయుగము ప్రబలుచునే యున్నదని చెప్పవచ్చును. ఈ యిరువదవ శతాబ్ది నుండి యాధునిక యుగము ప్రారంభమైన దనవచ్చును. దీనిని బట్టి, యీ వాఙ్మయ పరిణామకాలము నైదుయుగములుగా విభాగింపఁదగియున్నదని తెలియవచ్చుచున్నది. కాని మఱొక్క విషయము గమనింపఁ దగియున్నది ఈ ప్రబంధయుగకాలములో, నీ యాంధ్రదేశమునకు దగ్గర సంబంధము లేకపోయినను సామాన్య ప్రబంధలక్షణములతోఁ గూడినదే యైనను, మఱికొన్ని విశేషలక్షణములు గలదై మధుర తంజావూరు ప్రాంతపు దక్షిణదేశమున బయలుదేరిన వాఙ్మయము కొంత గలదు. ఇందలి కొన్ని విశేషలక్షణములు నూతనయుగ లక్షణములను దలఁపించుచున్నవి. ఆ కారణముచే వాస్తవముగ సాక్షాత్సంబంధ మేమియు లేకున్నను దీనియందె నూతనయుగ చిహ్నములు కనఁబడుటంజేసి దీనిని ప్రబంధాధునిక యుగముల నడుమ వెలసిన యొక సంధియుగమని తలంపవచ్చును. ఈసంధి యుగమును దక్షిణదేశ వాఙ్మయ యుగ మని నామకరణము చేయుదము. ఈరీతి నాంధ్రవాఙ్మయ పరిణామక్రమమునుబట్టి దాని చరిత్రను యుగములుగా విభజింపఁ దలఁచినచో నాఱు యుగములు పొడకట్టుచున్న వనవచ్చును. అవి —

# సారస్వత వ్యాసములు

౧. అజ్ఞాత యుగము - లేదా, ప్రాఙ్నన్నయార్య యుగము—?- క్రీ. శ. ౧౦౦౦.

౨. భాషాంతరీకరణ యుగము - లేదా, కవిత్రయ యుగము— క్రీ. శ. ౧౦౦౦-౧౩౫౦.

౩. సంధియుగము- లేదా, శ్రీనాథయుగము—క్రీ. శ. ౧౩౫౦-౧౫౦౦.

౪. ప్రబంధయుగము— క్రీ. శ. ౧౫౦౦-౧౭౦౦,

౫. దక్షిణదేశ వాఙ్మయ యుగము—౧౭౦౦-౧౮౦౦.

౬. అధునిక యుగము—౧౮౦౦.

ఆంధ్ర వాఙ్మయము నిట్లాఱు యుగములుగా విభాగించుటవలన దానిపరిణామక్రమము మాత్రమువిశదమగును. మరియు వాఙ్మయ స్వరూపం బెట్టిదో, దాని చరిత్రయన నేమో, దాని యందు మన కట్టి యాదరము గలుగుటకుఁ గల కారణము లెవ్వియో, సామాన్యగ్రంథపఠనముకంటె వాఙ్మయపఠన మెట్లు భిన్నంబగుచున్నదో, సామాన్య కావ్యపఠనమునకును, కావ్యానుశీలనము (Study of Poetry) నకును గల భేదమేమో, అట్టి కావ్యానుశీలన రీతులు వాఙ్మయానుశీలన పద్ధతులు నెట్టివో తెలిసికొని కావ్యములను బఠించువారికిఁగాని వాఙ్మయ తత్త్వము గోచరముగాదు.

# భారతాంధ్రీకరణము - ఎఱ్ఱాప్రెగ్గడ

ఆంధ్రభాషా వాగనుశాసనుఁడని ప్రసిద్ధిఁ గాంచిన నన్నయభట్టారకుఁడు చాళుక్య కులావతంసుఁడగు రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహమునఁ బంచమవేదం బనఁబరగిన కృష్ణ ద్వైపాయనమునివృషభాభిహిత మహాభారతము నాంధ్రీకరింప మొదలిడి, సుమారు మూఁడు పర్వముల గ్రంథము ముగించు నప్పటి కేకారణముచేతనో యతని నా మహోద్యమమునకు విఘ్నము వాటిల్లెను. ఈవిఘ్నమునకుఁ గారణములు పలువిధ ములుగాఁ జెప్పఁబడుచున్నవి. కాని యాగాథ లెంతవఱకు విశ్వాసపాత్రములో బాగుగఁ బరిశీలించినఁగాని నిర్ణయింప వీలులేదు. అతని దుస్స్వభావమే యావిఘ్నమునకు ముఖ్య కారణంబని చెప్పు గాథలు కొన్ని గలవు. కాని 'యవిరళజప హోమతత్పరుఁడు, సంహితాభ్యాసుఁడు, బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాననిరతుఁడు, సద్వినుతావదాత చరితుఁడు, లోక జ్ఞుఁడు, సత్ప్రతిభాభియోగ్యుఁడు, నిత్యసత్య వచనుఁడు' నగు నన్నపార్యుఁడు, "భూదేవకులాభిరూపణ మహీయఃప్రీతియుక్, పార్వతీపదాబ్జధ్యానపూజా మహోత్సవయుక్, సంతతదానశీల తయు, శశ్వత్సాధుసాంగత్యముక్" గలిగి, 'చాళుక్యకులైక భూషణుఁ'డని చెప్పబడు రాజనరేంద్రుని కరుణకుఁ బాత్రుఁ డైయున్న నన్నపార్యుఁడు, కవితారంగమునఁ బరోత్కర్ష నే మాత్రమును సహింపలేక ఘోరాపకారముల కొడిగట్టినపరమ దుశ్శీలుఁడని చెప్పుటయంత సమంజసముగాఁ గనఁబడదు. పైని చెప్పఁబడిన విశేషణము లన్నియు నాతఁడు తన్నుఁ దూర్చి తానే

చెప్పుకొనినవి కావున నాత్మశ్లాఘాపరుఁడగు నీతని మాటలను నమ్మఁగూడదని చెప్పుటయుఁదగదు. ఏలయన నావిశేషణము లాత్మశ్లాఘా సూచకములు కావనుటకే గావలయును సహజ వినయసంపన్నుఁడగు నీతఁడు "నన్నపార్యుఁ జూచి" యని ప్రథమ పురుషలోనే చెప్పెనుగాని యుత్తమపురుషలోఁ జెప్ప లేదు. ఇదియొక యాచారమనియుఁ గొందఱు తలంతురు. కాని, ఇది యీతని సౌశీల్యమును సన్నినుతావదాత చరిత్రను దెలుపు చున్న దనుటకు సందేహము లేదు. మఱియు నీతని దుశ్శీలమును గూర్చి కాని, భీమనాథర్వణులతో నీతనికిఁ గలిగిన సంబంధ మునుగూర్చి కాని తెలుపుటకు 16-వ శతాబ్దియం దప్పకవి యాంధ్రశబ్దచింతామణి తనకు లభించిన విధమును గూర్చి చెప్పుచు రచించిన,

"ఆంధ్రశబ్దచింతామణి వ్యాకరణము
ముందురచియించి తత్సూత్రములఁ దెనుంగు
బాసచేఁ జెప్పె నన్నయభట్టు తొల్లి
పర్వములు మూఁడు శ్రీమహాభారతమున"
"భారతముఁ దెనిఁగించుచుఁ దా రచించి
నట్టి రాఘవపాండవీయము నఖండ
ఛందము నడంప నీర్షక్రి సంగ్రహించె
ననుచు భీమన యొంతయు నడఁచె దాని."

అను పద్యములలోని గాథతక్క మఱి గ్రంథస్థమగు నిదర్శనమేదియుఁ గానవచ్చుట లేదు. అప్పకవి చెప్పినకథ కల్పిత మనియు, నది యెంతమాత్రము విశ్వాసపాత్రముకాదనియుఁ జెప్పఁదగియున్నది. ఇఁక భీమనయు, నథర్వణుఁడును నన్నయ

సమకాలికులే కారని తెలియవచ్చుచుండుటచే నన్నయ వీరి యెడల గావించిన యుపకార మేయాతని మతిభ్రమణమునకును, భారత మసంపూర్తిగా విడువఁబడుటకును గల కారణమని చెప్పుట యేమాత్రము సమంజసముగాఁ బోదు.

జనుల మర్మమున కేదో తాత్కాలికము నొక కారణము చెప్పుచుండుట లోకమునకు స్వాభావికము గాన, నన్నయ తరువాతఁ జిరకాలమువఱకు భారతాంధ్రీకరణము కొనసాగకుండుటను జూచి, దానికిఁ గారణముగా భీమనాథర్వణులతో నీతనికి సంబంధము గలిపి మతిభ్రమణకథ నొకదానిని గల్పించి యుందురు. ఈ కారణమువలని భయముచేతనే తరువాతి వారెవ్వరును తిక్కనకుఁ బూర్వము చేపట్టలేదను నమ్మకము కూడఁ బ్రబలియుండును. కావున నన్నయ తరువాత భారతాంధ్రీకరణ మంతకాలము అనఁగా తిక్కనకాలము వఱకు, నెందుకు కొనసాగియుండలేదు. అను విషయము పరిశీలింపఁ దగినదగుచున్నది.

నన్నయ భారతాంధ్రీకరణము వైదికమతాభిమానులగు చాళుక్యరాజులు వైదిక మతవ్యాపనము కొఱకుఁ బ్రోత్సహించుటచేఁ బ్రారంభింపఁబడినది. రాజనరేంద్రుని తర్వాత నాతని కుమారుఁడగు మొదటి కులోత్తుంగ చోడదేవుఁడు క్రీ శ. 1063 మొదలుకొని 1112.వ సంవత్సరము వఱకుఁ బరిపాలనము చేసెనుగాని, యీతనికి చోడులతో గల సంబంధమునుబట్టి చోళదేశముమీఁదనే యధికారము కలవాఁడయి రాజధానిని చోళదేశమునకు మార్చుకొని యీ వేఁగిదేశ రాజ్యాధికారమును దాను నియమించుచువచ్చిన

పాలకులకు వదలి వేసెను. మొత్తముమీఁద నీతఁడు శివభక్తుఁడైనను బ్రాహ్మణమతాభిమానియగుటచే నీతని కాలమునందును బ్రాహ్మణమతము వర్ధిల్లుచునేయుండెను. రామానుజుని వైష్ణవమతమున కీతని రాజ్యమునఁ జోటు దొరకకుండుటే కాక యాతఁడు రామానుజునిఁ బట్టి బధించు నుద్దేశము కలవాఁడని తెలియఁగా నాతఁడా దేశమును విడిచి గాంగవాడిదేశమునకుఁ బోయి యచ్చటి రాజుల యవలంబనంబును బడసి వైష్ణవమత ప్రచారమును, బౌద్ధ జైన మత నిర్మూలమును గావించుచుండెనని తెలియవచ్చుచున్నది. పిదప నీదేశము పశ్చిమచాళుక్యుల వశమై మఱి కొంతకాలమునకుఁ గాకతీయరాజుల యాధీనమయ్యెను. రాజనరేంద్రుని తరువాత నచిరకాలములోనే యీ వేఁగిదేశమున సారస్వతాభివృద్ధికిఁ దగిన రాజపోషణమును శాంతియు స్థిరప్రభుత్వమును లేకుండెను. మొత్తము మీఁదఁ నీ 12-వ శతాబ్ది నీ దేశము భిన్నమతకల్లోలమునకుఁ దావలంబయ్యెను. చోళచాళుక్యుల సామ్రాజ్యములు క్షీణించుటచే దేశమున స్థిరప్రభుత్వము లేక, కొంతవఱకరాజకమై యుండెను. ఒక వైపున వైష్ణవమతము విజృంభించి వీరవైష్ణవమై తక్కినమతముల నణఁగఁద్రొక్క యత్నించుచుండఁగా మఱియొక వైపున వీరశైవమతము బయలుదేరి, జైనబౌద్ధమతములతోపాటు వైదికమతమునుగూడ ఖండించి తద్వ్యాపనము నరికట్టుచుండెను. పండ్రెండవశతాబ్ది మధ్యభాగమున చాళుక్యరాజ్యము నాక్రమించుకొనిన బిజ్జలుఁడు వీరశైవమతమగు లింగాయతమతమును బయలుదేరఁదీసిన బసవేశ్వరునికి మంత్రి పదవి నిచ్చి, యాతని సైన్యాధ్యక్షునిఁగను ధనాగారా

ధ్యక్షునిఁగను నియమించుటయు, నా యధికారముతో నీతఁడు మతవ్యాప్తికై రాజ్యమందలి ధనాధికారముల నుపయోగించుటచే బిజ్జలునికి నీతనికిని గలిగిన వైషమ్యము కారణముగా దేశ మతిఘోరమగు మతయుద్ధమున మునుఁగవలసివచ్చెను. ఇట్టి మతకల్లోలములతో నిండి శాంతిలేని యీ కాలమున వైదికమతమున కవలంబనము తగ్గుటచే నన్నయ మొదలుపెట్టిన వ్యాసభారతాంధ్రీకరణమును మరలఁ జేపట్టువారు లేకపోయిరి. భారతాంధ్రీకరణప్రయత్నము సామాన్యకార్యము కాదు. ఏచిన్న కావ్యమునో తెనిఁగించుటవంటిది కాదు. అది యపారమైన గ్రంథము. దానికి రాజావలంబనము, మనశ్శాంతి, చిత్తస్థైర్యము, భాషాపాటవము, మిత్రుల ప్రోత్సాహము మొదలగునవెన్నియో సమకూడుటచేతనే నన్నయ యద్దానిని నిర్వహింపఁగలిగెను. చాళుక్యుల యధికారము సన్నగిలుట, వైదికమతమున కవలంబనము తగ్గుట, అన్యమతములు దేశమునఁ బ్రబలి మతివైషమ్యములకు మతయుద్ధములకుఁ గారణమగుట, సామ్రాజ్యాధికారుల దుర్బలత్వముచేఁ జిన్న చిన్న మండలాధికారు లందఱు దేశాధికారము నాక్రమింపవలయునని చేసెడి ప్రయత్నముల మూలమున దేశ మల్లకల్లోలముగా నుండుట—ఈ మొదలగు కారణములచే 11-వ శతాబ్దిమధ్యభాగమునుండి 12-వ శతాబ్దాంతిమ భాగమువఱకు సారస్వతాభివృద్ధి కనువగు పరిస్థితు లీదేశమున నేర్పడలేదు. మన మెఱింగిన యీ కాలము నాఁటి కవులైనను వేఁగిదేశ మందలివారు గాక, దక్షిణదేశమందలివారో లేక కాకతీయరాజ్యప్రాంతమందలివారో యయియున్నారు. ఇంతేకాక పలువురు

రాజులో, మండలాధిపతులో లేక, మంత్రులో యైయున్నారు. నన్నెచోడుఁడు కావేరీతీరమందలి యొరయూరు రాజధానిగా జోళమండలము నేలినవాఁడుగాఁ జెప్పుకొనియున్నాఁడు. ఈతఁ డెచ్చటివాఁ డైనను శైవమతాభినివేశము కలవాఁడై మల్లికార్జునుని గురువుగాఁ బడసి గురువునే సర్వేశ్వరునిగా భావించి, యట్టియభేదబుద్ధితో "కుమారసంభవ"మును రచించిన వాఁడగుటచే కొంచెము తరువాతికాలమున పాల్కురికి సోమనాథునిచే వృద్ధినొందింపఁబడిన యాంధ్రదేశమునందలి శైవ వాఙ్మయ శాఖకీతఁడు మూలముగా గనఁబడుచున్నాఁడు. ఈతఁడు నన్నయకుఁ దరువాతి వాఁడే యైనను శైవుఁ డగుటచే నీతనికి వైదిక మతమందుఁ గాని, తద్వ్యాప్తి కొఱకుఁగా, బ్రారంభింపఁబడిన భారతాంధ్రీకరణమునఁ గాని యాదరము లేకుండెనని తలంపఁ దగును.

ఇఁక నన్నయ తిక్కనల మధ్యకాలమున నున్నవారిలోఁ బ్రసిద్ధపురుషుఁడని చెప్పఁదగినవాఁడు మంత్రి భాస్కరుఁడొకఁడు. ఈతనిఁ గూర్చి కవిబ్రహ్మయగు తిక్కనచేసిన ప్రశంసను బట్టియు, కేతనాదులు చేసిన వర్ణనమునుబట్టియు, నీతఁడొక ప్రసిద్ధ కవి యనుమాట నిశ్చయము. తిక్కనాదులు చెప్పక పోవుటచే రామాయణ కర్తృత్వ మీతనియం దారోపించుట విషయమున భిన్నాభిప్రాయములు కలవు. అయినను ఇట్టి ప్రసిద్ధకవి యగువాఁడు నన్నయ మొదలుపెట్టి విడిచివేసిన భారతామ్నాయమునే కైకొని తెనిఁగింపక, తాను రామాయణమును జేపట్టుటకుఁ గారణ మేమైయుండును? మతవైషమ్యములు విశేషముగాఁ బెరిగియున్న యీకాలముల వైదిక

మతమున కంత ప్రాబల్యములేక పోవుటచే నన్నయభారతము నకుఁగూడ దేశమున విశేష ప్రచారము లేకపోయి యుండ వచ్చును. కావున నాంధ్రీకృత భారతము నీతఁడు చూచి యుండెనో లేదో, చెప్పలేము. ఇంతేకాక మంత్రి భాస్కరుని కుమారుఁడగు తిక్కభూపాలుఁడు వైష్ణవ మతావలంబకుఁడై పాకనాడు, కమ్మనాడు మొదలగు దేశములలో వైష్ణవమత వ్యాపనమునకుఁ దోడ్పడుచు, కాంచీపురమునందలి వరదరాజ స్వామియం దత్యంత భక్తిగలవాఁడై, యనేక విష్ణ్వాలయము లను నెలకొల్పినట్లు తెలియుచుండుటచే, నీతని తండ్రియగు మంత్రి భాస్కరుఁడు కూడఁ గొంతవఱకు వైష్ణవమతాభి మానము కలవాఁడై యుండెనని తలంపఁ దగియున్నది. ఆ కారణముచేతనే యితఁడు వైదిక మతవ్యాప్తికిఁ దోడ్పడు భారతమును విడచి, వైష్ణవ మతోద్బోధకం బగు రామాయ ణము నాంధ్రీకరింపఁ దొడఁగి యుండవచ్చును. తిక్కభూపాలుఁ డైనను వైష్ణవమతమునం దభిమానము కలవాఁడై యున్నను, తక్కినమతములందు ద్వేషబుద్ధి లేక పరమతసహనము కల వాఁడువలెనే కనఁబడుచున్నాఁడు. కవితిక్కన యన్ననో హరి హరులకు భేదమేలేదని తలంచినవాఁడగుటచే నద్వైతభావమే కలవాఁడై, మరల నన్నయభారతమును జేపట్టి తెనిఁగింప దొర కొనెను. దేశమున నూతన మతకర్తలు బయలుదేరి నూతన మతములను వ్యాపింపఁ జేయుచున్న కాలమున వారి బోధన లచే నాకర్షింపబడిన వారిలోఁ గొందఱు వైష్ణవమతాభిమాన మును, గొందఱు శైవ మతాభిమానమును గలవారై యుండుట తటస్థింపవచ్చును. కావుననే మంత్రిభాస్కరుఁడును,

తిక్కభూపాలుఁడును వైష్ణవమునం దభిమానము గలవారై యుండఁగా తిక్కనసోమయాజి ప్రాచీనంబగు వైదికమతమందే తాత్పర్యము కలవాఁడై యుండినచో నాకాలమున నది యొక విపరీతముగా నెన్నఁదగినది కాదు. ఇట్లు భారతము పూర్తిగాకుండ రామాయణాంధ్రీకరణము ప్రారంభింపఁ బడుటకు దేశస్థితి, మతభేదములే కారణముగా గ్రహింపఁ దగియున్నవి. భాస్కరుఁడు తీవ్రముగ వైష్ణవ మతాభిమానియై రామాయణమును దెనిఁగించుటం జేసియే "సారకవితాభిరాముఁడై" నను ఆతని యీ గ్రంథమును తిక్కన పేరొక్కన లేదేమో ?

ఆ కాలములో, నసఁగాఁ దిక్కనకు సమకాలికులలో కొంచెము తరువాతివారో యనఁదగు, కోన బుద్ధ భూవిభుఁడును, అతని కొడుకులుగాఁ జెప్పఁబడు కాచవిభుఁడు, విఠ్ఠలరాజును రామాయణము నంతను అనగాఁ బూర్వోత్తరరామాయణములను ద్విపద కావ్యముగాఁ గూడ రచించిన ట్లగపడుచున్నది. ఇట్లు భారతమును వదలి రామాయణమును జేపట్టిన వారిలో వీరుగూడఁ గనఁబడుచున్నారు.

ఈ కోన బుద్ధారెడ్డి తండ్రి విఠ్ఠలధరణీశుఁడని ద్విపద రామాయణముననే కనఁబడుచున్నది. ఈ విఠ్ఠలనాథుఁడు రుద్రమదేవి కాలములో కాకతీయ సామ్రాజ్యమునం దొక భాగమున కాధిపత్యము గలవాఁడైన కోన గన్నారెడ్డికి సోదరుఁడై యాతనియొద్ద సేనాధిపతిగా నుండినట్లు తెలియుచున్నది. కాని యాతని యన్న శైవమతాభిమానము కలవాఁడై యుండ నీతఁడు తన పేరునకుఁ దగినట్లుగా వైష్ణవ మతాభిమానము

కలవాఁడువలెఁ గనఁబడుచున్నాఁడు. ఈ కారణముచేఁ గావలయు నీతని కుమారుఁడగు బుద్ధారెడ్డికూడ వైష్ణవ మతాభిమానము కలవాఁడై, ద్విపద రామాయణమును దనతండ్రి పేరఁ బనిపూని చెప్పుట తటస్థించి యుండును. కాకతీయ రాజ్యము మొదట జైనమతమునకుఁ బట్టుకొమ్మయై, కొంతకాల మైన పిదప వీరశైవమున కవలంబనంబై యుండుట సుప్రసిద్ధమేకాని, వైష్ణవ మతమున కెప్పుడుగాని చోటిచ్చినట్లు కనఁబడదు. కాని మొదటి ప్రతాపరుద్రుని కాలమున గురు మల్లికార్జున పండితారాధ్యుల శిష్యుఁడైన పాల్కురికి సోమనాథుఁడు బసవపురాణము. పండితారాధ్య చరిత్రము, వృషాధిప శతకము మొదలగు గ్రంథముల రచించి వైష్ణవమునకును వైదిక మతమునకును గూడ విరుద్ధంబగు వీరశైవమును సామాన్యజనుల కందఱకు సుబోధంబగునటుల సంస్కృత వృత్తంబులనువదలి దేశీయంబగు ద్విపదలలో రచించి బోధించిన వాఁడగుటం జేసి యద్దానికిఁ బోటీగా నించుక తరువాతి కాలమున రంగనాథుఁడను కవీశ్వరుఁ డొకఁడు వైష్ణవ మతోద్బోధకంబగు రామాయణమును రచించి కొంత వైష్ణవాభినివేశముగల బుద్ధరాజు పేరఁ బ్రకటించెనేమో యను సందేహము కలుగకమానదు. ఇట్లు ప్రసిద్ధులు, పేరు ప్రతిష్ఠలు గల కవులందఱు మతాభినివేశమునకు లొంగినవారై యేదో యొక విధముగ వైదికమతముపైఁ గత్తికట్టినవారే యగుటచే నన్నయ తరువాత సుమారు రెండువందల సంవత్సరములవఱకు భారతాంధ్రీకరణము పూర్తి యగుట తటస్థింపలేదు.

ఈ మధ్యకాలమున మిగిలిపోయిన ప్రసిద్ధ కవులలో నథర్వణుఁ డొకఁ డున్నవాఁడు. ఈతఁడు తిక్కనకుఁ గొంచెము పూర్వుఁడో, సమకాలికుఁడో యని చెప్పఁదగియున్నాఁడు. నన్నయ తరువాత నన్నయ యంతవాఁ డీతఁ డని లోకప్రసిద్ధి కావుననే ద్వితీయాచార్యుఁడని ప్రసిద్ధి గలిగినది. ఈ ప్రసిద్ధికిఁ దగిన కారణములు లేకపోలేదు. ఏలయన—నన్నయతరువాత నాతఁడు మొదలుపెట్టిన యుద్యమములను, లేదా గ్రంథములను కొనసాగింపవలయునని తలఁచి, కృషి సల్పినవాఁడు తిక్కనకుఁ బూర్వ మీతఁ డొక్కఁడే కనఁబడుచున్నాఁడు. భారతమున నన్నయ రచించిన మొదటి మూఁడు పర్వములునుగాకఁ తరువాతి విరాటోద్యోగ భీష్మ పర్వము లీతఁడు రచించిన ట్లగపడుచుండుటచేతను, ఈతనిచే రచింపఁ బడెనని లోకమునఁ దలంపఁ బడుచున్న వికృతి వివేకము, లేక యథర్వణ కారికావళి యను లక్షణగ్రంథము నన్నయ చెప్పిన (?) యాంధ్రభాషా లక్షణముకంటె విశేషాంశములతోఁ గూడి దానికి పూరక గ్రంథముగాఁ దలఁపఁబడుచుండుటచేతను ఈతఁడు నన్నయ యుద్దేశములను గొనసాగింపఁ బూనుకొనిన వాఁడు వలె గనఁబడును. ఈతని పుట్టుక పూర్వోత్తరములను గూర్చి తెలిసికొనుట కాధారము లేమియు విశేషముగా లేవుగాని, యీతఁడు జైనుఁడై యుండుననిమాత్రము కొందఱు తలంచుచున్నారు. కాని, యీ కారికావళి యాంధ్రశబ్ద చింతామణి యందుఁ దెలుపఁబడిన యాంధ్రభాషా లక్షణముకంటె విలక్షణములగు కొన్ని విశేషములను జేర్చి వ్రాయఁబడిన పూరక గ్రంథమగుట చేతను, అథర్వణుఁడు త్రిలింగ శబ్దానుశాసన

మను నుఱియొక లక్షణగ్రంథము రచించినట్లు తెలియవచ్చు చుండుటచేతను, కారికావళి యిటీవలి కాలమున బయలుదేరిన గ్రంథమేమో యను సందేహమున కవకాశము లేక పోలేదు. ఈ త్రిలింగ శబ్దానుశాసనమైనను కొంచె మించుమించుగాఁ దనకు సమానకాలమున రచింపఁ బడినదగుటచేఁ గాఁబోలు, కేతన దృష్టిపథమునఁ గూడఁ బడినట్లు కనఁబడదు. ఈతఁడు రచించిన భారతమైనను వ్యాసముని ప్రణీత భారతపక్కినసన రించినదిగాక, జైనమతానుకూలంబై యుండిన దగుటచేఁ గావలయు, విశేషప్రచారము లేకయుండెను. ఇంతలో నద్వైత మతానుకూలముగఁ దిక్కన సోమయాజి రచించిన భారత భాగము పైకివచ్చుటచే, దాని కాదరము లేక కాలక్రమమున నది రూపుమాసి పోయియుండును. మొత్తము మీఁద విచా రింపఁగా నన్నయ యాంధ్రీకరింప మొదలుపెట్టిన భారత మును బూర్తిచేయ గలిగినశక్తి ఆతని తర్వాత సుమారు రెండువందల యేండ్లవఱకు నెవ్వరికిఁ గలిగినట్లుకనఁ బడదు. మఱి విశేష మేమనఁగాఁ బదుమూఁడవ శతాబ్ది మధ్యభాగము ప్రాప్తించు నప్పటికి భారతాంధ్రీకరణ విష యకమగు తలంపొక్క తిక్కనకే కాక మఱియొకనికిఁగూడ గలుగుట కనువగు పరిస్థితు లేర్పడియుండునని యూహింపఁదగి యున్నది. దేశములో బయలుదేరినభిన్నమతముల పరస్పరవైష మ్యము, స్పర్ధ కొంతవఱకు తగ్గి, యద్వైత మతము నందుఁ గొంత యభిమాన మేర్పడుకాలము వచ్చినది. దేశమునందు మతము సాంఘికస్థితి మాఱిపోవుటకుఁ బ్రారంభించినవి. పౌరా ణిక మతము మరలఁ దలయెత్త మొదలుపెట్టినది. ప్రాచీనమైన

దేవతార్చనము పోడసూపసాగినది; న్యాయధర్మశాస్త్రవిషయకము లగు నిబంధన గ్రంథము లనేకములు వ్రాయఁబడవలసి వచ్చినది. కావుననే విజ్ఞానేశ్వరకు మొదలగువారి గ్రంథము లాంధ్రములోనికిఁగూడ దిగినవి. ఈ కాలముననే కదా కేతన విజ్ఞానేశ్వరము నాంధ్రభాషయందు రచించుట తటస్థించినది. ఇట్టిసమయముననే తిక్కనసోమయాజి నన్నయరచించిన వ్యాస భారతమును మరలఁ జేపట్టి, యాంధ్రభాషలో రచించుటయుఁ దటస్థించినది. హరిహరులయందభేద బుద్ధి గలిగి, సోమయాజియై తిక్కనరచించిన భారతము బయలువడుటచే నథర్వణభారతము వెనుకఁబడినది. రాజ రాజ నరేంద్రుని తరువాతవచ్చిన చాళుక్యచోడ చక్రవర్తులు వేఁగి దేశమున నుండక ద్రావిడ దేశమునం దున్నవారగుటచే వారి కాంధ్రభాషయందుకంటె ద్రావిడ భాషయందభిమానము హెచ్చయ్యెను. కావున. రాజరాజనరేంద్రుని వెనువెంటనే భారతాంధ్రీకరణోద్యమము కొనసాగించుటకు వారొకవేళ కొంతప్రయత్నము సలిపినను అన్యమతవిజృంభణము ప్రబలిన యీ కాలమున, వారిప్రయత్నములు సఫలములు కాలేదు. తరువాత వారికి దీనియం దంత యుత్సాహము లేకపోయినది. వారుప్రయత్నములు చేసినప్పుడైనను నన్నయ రచించిన భాగములోని యుత్తమములగు కొన్ని పద్యములను తాటాకులమీఁద వ్రాయించి యీ పద్యములతో సమానముగఁ గవిత్వము చెప్పఁగలవారెవరైన నన్నయ విడిచిన భారత భాగమును పూర్తిజేయఁ బూనుకొందురా యని కొందఱచే నాపద్యముల దేశదేశములఁ ద్రిప్పినట్లుక కథ మాత్రమే కలదు. ఈ కథలో నేమేని సత్య

మున్నచో, నా కాలమున నన్నయ రచించిన భారతభాగము యొక్క ప్రతులు విశేషముగా వ్రాయఁబడి దేశమున వ్యాప్తిఁ జెంది యుండలేదనియు, రాజరాజు గతించిన పిదప భారతమును బూర్తిచేయింపఁదలంచినవారు కొన్ని మూఁడెరి పద్యములను మాత్రము వ్రాయించి "నన్నయ కవిత్వ మిట్లున్నది. ఆతఁడు వ్యాస భారతము నాంధ్రీకరింప మొదలిడి కొంతవఱకు రచించి గతించినాఁడు. దీనిని గొనసాగింపఁ గలవా రెవరైన గలరా?" యని దేశమునందలి ప్రసిద్ధములగు నాస్థానములకుఁ గబురు పంపియుందురనియు నూహింపఁ దగియున్నది.

దేశమున వైదికమతమునాదరము తగ్గుటచే నెంటనే యీకార్యమును జేపట్టువారు లేకపోయిరి. పిదప దేశము మత వైషమ్యములకు, నూతన మత ప్రచారమునకుఁ దావలం బగుటచే నీ నన్నయ భారతభాగమునకు విశేషప్రచారముగాని, ప్రత్యంతరములు వ్రాయఁబడుట కవకాశముగాని లేకుండెను. కావుననే నన్నయనుగూర్చికాని, యాతని భారతమునుగూర్చి కాని యాతనితరువాత సుమారు రెండువందల సంవత్సరముల వఱకు అనఁగా, తిక్కనకాలము వఱకుఁ బ్రశంసించినవారైన నెవరుఁ గనఁబడరు. చూచినవారు, చదివిన వారు నంతకంటెను గనఁబడరు. తిక్కనయైనను బ్రథమమునఁ దాను రచించిన నిర్వచనోత్తర రామాయణమున నన్నయ్యప్రశంస యేమియుఁ జేసిన వాఁడుకాఁడు. ఆంధ్రభాష కాదికవియని, ఆంధ్రభాషా వాగనుశాసనుఁడని తరువాత నంతప్రసిద్ధినందిన నన్నయపేరైన నెత్త లేదు.

"హరిహర పద్మగర్భులను
నాదికవీంద్రుల నూత్నసత్కవి
శ్వరులను భక్తిఁ గొల్చి మఱి
వాక్ప్రౌఢిఁ గవితావిలాస వి
స్తరమహనీయుఁడైన నను"

అని ఆదికవీంద్రులను, నూత్నకవులను నెన్నెనే కాని, యీ నూత్నకవులలోనైన నన్నయకూడనుండెనో లేదో అతఁడు చెప్పలేదు. దీనిని మనము నిర్ధారణచేయుట కవకాశమును లేదు. ఆకాలమునకు నన్నయ రచించిన భారతభాగము విశేష ప్రచారములో నుండి యందఱచేఁ జదువఁబడుచు నాంధ్రావళికి మోదముం గూర్చుచునే యున్నచో, తిక్కన తాను స్వయముగా నద్దానిం జదువుటచేతనే కవితావిలాసవిస్తర మహనీయుఁడై నెగడినచో, నా యాదికవియగు నన్నయనామమునైన నొకసారి తన మొదటి గ్రంథమున స్మరింపకుండునా? మఱియు, నన్నయభారతభాగమును ఉత్తరరామాయణరచనకుఁబూర్వమే తిక్కన చదివి యున్నచో కొఱవడియున్న యీ పంచమవేదమును ముందు పూర్తిచేయఁ దొడంగక రామాయణము నేల రచింపఁ బూనుకొనును? ఇంకను దాను యజ్ఞముచేయకుండుటచే, యజ్ఞము చేసికాని మొదలు పెట్టఁ దలంపలే దనికాని, లేదా ఆతని కింకను భారతరచనను జేపట్టుటకుఁ దగిన కవితాసామర్థ్యము చిక్కలేదనికాని చెప్పుట అంత యుక్తియుక్తముగాఁ గనఁబడదు. అట్లే అయినను ఉత్తరరామాయణమున నాతనిఁ బేర్కొనకుండుటకుఁ గారణ మగపడదు. ఇఁకఁ దాను

భారతరచనకుఁ గడంగినపుడైనను నన్నయ భారతభాగమును స్వయముగాఁ జదివి యాతని కవితాపద్ధతులందును, రచనా విశేషములందును అత్యంతాదరము కలవాఁడువలె నాభారత రచనను గూర్చి కాని, తద్రచయితయొక్క గొప్పదనమునుగూర్చి కాని విశేషముగా నేమియుఁజెప్పక, మహాభారతము చాల గొప్పదని దానిని విశేషముగాఁ బొగడుచు నది

"ఆదరణీయసార వివి
ధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశ పర్వనిర్వహణ
సంభృతమై పెనుపొందియుండు"

నని పద్యమున రెండుపాదములతో భారత ప్రశంసచేసి,

"అం, దాదిఁ దొడంగి మూఁడుకృతు
లాంధ్రకవిత్వ విశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితా
త్ముఁడు నన్నయభట్టు దక్షతన్."

ఆ భారతమున మూఁడుకృతులు-పర్వములు-ఆంధ్రకవిత్వ విశారదుండగు నన్నయభట్టు ఆంధ్రభాషయందు రచించెను అని చెప్పినాఁడు. ఆంధ్రభాషయం దంతకుఁ బూర్వ మంత ప్రసిద్ధమైన కవిత్వము లేకుండుటచే నా భాషలో నొక యుద్గ్రంథమును వ్రాసినాఁడు గనుక ఆంధ్రకవిత్వవిశారదుఁ డనువిశేషణము వేసిన ట్లగపడుచున్నదిగాని నన్నయకవితయందుఁ గాని, యాతని కృతియందుఁగాని యీతనికిఁగల విశేషాదరమును వ్యక్తపఱుపఁజాలదు. విద్యాదయితుఁడు, మహితాత్ముఁడు"

అనునవి నన్నయను గూర్చిన విశేషణములుగాని యాతని కృతిని గూర్చినవి కావు. అంతకుఁబూర్వ మాంధ్రమున భారతమంతటి యుద్గ్రంథము నెవ్వరు వ్రాయఁ బూనలేదు. కావున, నెట్టి యభ్యంతరములను సరకుగొనక, వైదికమత ప్రతిపాదకమగు వ్యాసభారతాంధ్రీకరణమును "దక్షతతో" నిర్వహించినాఁడు గావున, నట్లే చెప్పినాఁడు. కాని యాకృతితోఁ దనకుఁగల సన్నిహితపరిచయమును జూపలేదు. తాను రచింపఁబూనిన గ్రంథమును గూర్చి యెట్లు చెప్పుకొనినాఁడో చూడుడు:

"హృదయాహ్లాదిచతుర్థ మూర్జితకథో
పేతంబు నానారసా
భ్యుదయోల్లాసి శరాటపర్వమట యు
ద్యోగాదులుం గూడఁగాఁ
బదునేనింటఁ దెనుంగుబాస జనసం
ప్రార్థ్యంబులై పెంపుతోఁ
దుదిముట్టన్ రచియించు టొప్పు
బుధసంతోషంబు నిండారఁగన్.
కావున భారతామృతము
కర్ణపుటంబుల నారఁగ్రోలి యాం
ధ్రావళి మోదముం బొరయు
నట్లుగ"

రచింపఁ బూనినాఁడు.

నన్నయభాగముకూడఁ జదివి యాంధ్రావళి యట్టియానందమును బొందుచున్నచో దానిని గూర్చి యించుకంతైనఁ

జెప్పెడా? నన్నయభాగమును జదివి, తానట్టి యానందమును బొందితి ననియైనఁ జెప్పెడా? ఏమియుఁ జెప్పలేదు. తనకు వైదికమార్గమునందుఁగల యభిమానమును, తనకుఁ బ్రత్యక్షమైన యిష్టదేవత చెప్పినట్లుగా, ఇట్లు చెప్పినాఁడు :

"వైదికమార్గనిష్ఠునకు
వర్తనముం దగ నిర్వహించుచు
న్భేదములేని భక్తి మతి
నిర్మలవృత్తిగఁ జేయుచుండ మ
త్పాదనిరంతరస్మరణ
తత్పరభావముకల్మి నాత్మ స
మ్మోదముఁబొందఁ గావ్యరస
ముంగొనియాడుచునుండు దెప్పుడున్."

ఇట్లీవైదికమార్గమునందలి ప్రీతియు, పంచమవేదంబగు భారతము మూలమున నాగమమును వ్యాపింపఁజేయు నుద్దేశమును, చాళుక్య ప్రభువు లొనరించిన మహాకార్యము నందలి గౌరవమునుఁ వారి ప్రోత్సాహమున భారతాంధ్రీకరణ కార్యమునకుఁ బూనిన నన్నయ్య యందలి భక్తియును గారణములుగా, నన్నయ యొనర్చిన మూఁడు కృతులను వదలి తిక్కన తక్కిన పర్వముల నాంధ్రమున రచింపఁబూనెనని తలంపఁదగి యున్నది. అంతేకాని నన్నయ రచించిన భాగమును సంపాదించి, చూచి, చదివి, మిగిలినభాగమును బూరించినాఁడను విషయము సందేహాస్పదమనక తప్పదు.

తిక్కన నన్నయవ్రాసిన గ్రంథభాగమును జూచి యున్నాఁడనినచో నన్నయ మూఁడుకృతులు సంపూర్ణముగా

వ్రాసియుండిన బాధలేదు కాని, యట్లుగానిచో, రాజ్యతం త్రము నవలీలగ నడపి పరదేశముల కేగి రాజుల మెప్పించి పరమతముల ఖండించి దిగ్విజయముగాంచి యత్యంత మేధావంతుఁడును, ధైర్యస్థైర్యములు గలవాఁడును నని పేరుగాంచిన తిక్కన యారణ్యపర్వభాగమును బూర్తి చేసినచో మృత్యువు వాతఁబడుదునేమో యను భయముచేఁ బిఱికి పందవలె వెనుదీసినాఁడని చెప్పవలసివచ్చును. తిక్కన నన్నయభారతమున మూఁడుకృతులు సంపూర్ణముగా నుండుటను జూచి, నాలవ కృతి ప్రారంభించినాఁ డన్నచో, రాజమహేంద్రవరమునఁగల మూలగ్రంథము నీతఁ డెట్లో విశేష ప్రయత్నముచేసి సంపాదించినాఁడనియో, లేదా, రాజమహేంద్రవరమునకుఁ బోయి, యా ప్రతిని జూచి వచ్చినాఁడనియో చెప్పవలెను. కాని, దేశమున ననేకములుగా ప్రతులున్నవనియు, నా ప్రతులన్నిటిలో మూఁడు కృతులు సంపూర్ణముగా నున్నవనియుఁ జెప్పినచో, తిక్కన తరువాత నేఁబదియఱువది సంవత్సరములలో నెఱ్ఱాప్రెగ్గడ చూచుసరికే దేశమునఁగల ప్రతులన్నిటిలో నొక్క భాగము మాత్రమే హఠాత్తుగా శిథిలమైనదనుట విశ్వాసపాత్రమెంత మాత్రము కాదు. ఎఱ్ఱాప్రెగ్గడకు దొరకిన ప్రతిలోనే కొంతభాగము పోయియుండినచో నన్నయవ్రాసిన సంపూర్ణభాగము తరువాతనైన దొరకవలసినదే గదా. దీనినిబట్టి, నన్నయ్య యారణ్యపర్వము పూర్తిచేయకుండ విడువఁగాఁ దిక్కన యా భారతభాగమును జూడనేలేదని కాని, దేశమున దానికిఁ బ్రచారము లేకుండుటచే నొక్కటే ప్రతియుండఁగా

నద్దానినెట్లో తిక్కన చూచి, యందు మూడు కృతులు సంపూర్ణముగా నుండుటచే నాల్గవపర్వమును మొదలుపెట్టి పూర్తి చేయఁగాఁ గొంతకాలమున కా ప్రతియందలి చివరభాగము శిథిలమైపోవుటచే నెఱ్ఱాప్రెగ్గడ దానిని బూరించెననికాని, లేదా, తిక్కన యసంపూర్ణ గ్రంథమునే చూచినను మతి భ్రమణభయముచే నా భాగమును బూర్తి చేయక వదలివేసెననికాని, మూఁడు విధములుగా మనము తలంపవచ్చును. ఇందు మూఁడవ దానికంటె మొదటి రెండుయుక్తులే కొంత వఱకు సంభావ్యములుగఁ గనఁబడుచున్నవి. అందును రెండవ దానికంటె మొదటిది బలవత్తరముగా నున్నట్లు తోఁపకపోదు. ఏది యెట్లున్నను, ఆరణ్యపర్వమును నన్నయ సంపూర్ణముగా రచించెననియు, మూఁడుపర్వములు సంపూర్ణముగా నున్న ప్రతిని తిక్కన చూచి నాలవపర్వము మొదలు భారతమునంతయు బూర్తిచేసిన పిదప నలుబదియేఁబది యేండ్లకా యారణ్యపర్వమునఁ గడిభాగ మచ్చటచ్చట క్రిమిదష్టమైనందున శిథిలముకాఁగా, నెఱ్ఱాప్రెగ్గడ ఆ శిథిలభాగముల నచ్చటచ్చట పోయిన వర్ణములను, పదములను, పాదములను స్వయముగా నతికి, "తత్ప్రచనయకా నారణ్యపర్వశేషముఁ బూరించె" ననుట యెంతమాత్రము సమంజసముగాఁ గనఁబడదు. నన్నయ భావములు, పదగుంఫనములు, వాక్యవైఖరి మొదలగు రచనా రీతు లెన్నియేని యీ భాగమునఁ గనఁబడుచున్నవి గావున నీ భాగమునుగూడ నన్నయయే వ్రాసియుండవలెను; వర్ణ పదపాదముల పూరణమే ఎఱ్ఱాప్రెగ్గడచేసిన పూరణమను

టయు నేఁతమాత్రము యుక్తియుక్తము కాదు. ఏలయన నెఱ్ఱాప్రెగ్గడచేఁ "తద్రచనయుక్త్యా" పూరించితినని వ్రాసికొని యున్నాఁడు. అనఁగా, నిది నన్నయరచనయే యని చూచినవా రందఱు ననుకొనునట్లాభాగమును రచించుటకుఁ గూడ నాతఁడు పడవలసిన పాట్లన్నియుఁ బడినాఁడని తలంపఁదగి యున్నది. రచనావిషయమున నన్నయ ననుకరించుట కెంత ప్రయత్నమైనఁ జేసినాఁడు. కావుననే నన్నయ రచనావిశేషములు ఎఱ్ఱాప్రెగ్గడ భాగములోఁ గనఁబడుచున్నవి. కనుక నిది నన్నయరచించినదే యను వాదమెంతయు యుక్తిరహితముగాఁ గనఁబడుచున్నది. ఇప్పుడు మనము చూడవలసినదేమనఁగా నీ యనుకరణప్రయత్నములో "తద్రచనయుక్త్యా" నన్నయరచనయే అని చూపించుటలోఁ గూడ నెఱ్ఱాప్రెగ్గడ యెంతవఱకు నెగ్గినాఁడు? ఎక్కడనైన భేదము లేక నన్నయ రచనాపద్ధతి నంతను దెచ్చి యిచట నిలిపినాఁడా యని పరిశీలించినచో, నది శిథిలగ్రంథ పూరణమా, లేక అనుకరణపద్ధతి మీఁదఁ జేయఁబడిన స్వతంత్రరచనయా యను విషయము నిర్ధారణచేయుట కవకాశము కలుగును. అటుపైని ఈ యారణ్యపర్వభాగ పూరణము 'తద్రచనయుక్త్యాఁ' జేయుటకుఁ గారణము నన్నయ దుఃస్వభావసర్వపాకము కారణముగా నాతనికిఁ గలిగినదని తరువాతివారు బయలుదేరఁదీసిన మతిభ్రమణరూప కథామూలకమగు భ్రాంతియా, లేక నన్నయతిక్కనలు తలపెట్టిన యుద్యమమునందలి భక్తియా యను విషయముకూడ తేలఁగలదు.

ఈ సందర్భమున నన్నయ భారతభాగమునను (అనఁగా మొదటి రెండుపర్వములు మూఁడవపర్వము 4 ఆ వఱకు), తరువాత యెఱ్ఱాప్రెగ్గడ రచించిన యారణ్యపర్వశేషభాగము నందుగల అక్కరపద్యములను, వాని లక్షణమును గొంచెము పరిశీలించినచో నది యేతద్విషయ నిర్ణయమునఁ గొంతవఱకుఁ దోడ్పడఁ గలదని నా నమ్మకము. ఆంధ్రవాఙ్మయకర్తలలో నొక్క భారత కవులే అక్కరలను రచించిన వారుగా నున్నారు. అందు తిక్కన అక్కరలను రచింపలేదు. ఇఁక మిగిలిన యిద్దఱు నన్నయ యెఱ్ఱాప్రెగ్గడలు రచించిన మధ్యాక్కరలలోఁ గొంత లక్షణభేదము కనఁబడుచుండుట యొక విశేషము. నన్నయ మధ్యాక్కరలలోఁ బ్రతిపాదమునకు నాలుగవగణము తరువాత యతి పాటించినాఁడు. కాని యెఱ్ఱాప్రెగ్గడ మూఁడవ గణము తరువాతనే యతి పాటించినట్లగపడుచున్నది. వీరిద్దఱికి నీయొక్క పద్య రచన విషయమునే యిట్టి భేద మగపడుచుండఁగాఁ దెనుఁగు లాక్షణికు లందఱు నీపద్యమునకు లక్షణము చెప్పుటలో నన్నయ రచించిన పద్యముల లక్షణమును గ్రహించి చెప్పక, యెఱ్ఱాప్రెగ్గడ రచించిన పద్యముల లక్షణమునే గ్రహించి, అనఁగా బ్రతిపాదమునను రెం డింద్రగణములు, ఒక సూర్యగణము గలిగిన రెండు భాగములును, మూఁడవగణము తరువాతనే యతియు నని యిట్లు మధ్యాక్కరకు లక్షణము చెప్పినట్లు కనఁబడుచున్నది.

"ఓజతో నిద్ద టింద్రులును
నొక్క యాదిత్యుఁడు మఱియు

రాజితంబుగ నిద్దఱమర
రాజులు నొక్కసూర్యుండు."

—అనంతుఁడు.

" మునుపుగాఁ బ్రాసంబుఁ గూర్చి
మూఁటిపై విరమంబు నిల్పి
చన నింద్ర యుగళంబు మీఁద
జలజాప్తు నొక్కనిఁ జేర్చి
యిరమడించిన నాఱుగణము
లెనసిన నొక్కపాదంబు
దనర వక్కాణించినంతఁ
దగు నిట్లు మధ్యాక్కరంబు"

—అప్పకవి.

ఆదికవియగు నన్నయ పద్యముల లక్షణమును గైకొనక యెఱ్ఱాప్రెగ్గడ పద్యముల లక్షణమునే లాక్షణికులందఱు గ్రహించి చెప్పుటకుఁ గారణమేమైయుండునని విచారించిన చో నప్పటికే యిప్పటికివలెఁ దెనుఁగు లాక్షణికులకు నన్నయమధ్యాక్కరల లక్షణము కుదురక పోయియుండునేమో యని సందేహింపవలసి వచ్చుచున్నది, ఇప్పుడు పాఠభేదము లనేకము లుండుటంజేసి యన్నిపద్యముల కొక లక్షణము పట్టుటలేదు. ఇది పాఠభేదములను బట్టివచ్చినదికొక, లేక నన్నయ యవలంబించిన యా కాలమునాఁటి లక్షణమందే భేదమున్నదో చెప్పుట కవకాశము లేకున్నది. దీని విషయమై పండితులు భిన్నాభిప్రాయులై యున్నారు. యుద్ధమల్లుని శాసనములోని

యక్కరలలో నా వ గణము తరువాతనే యతి కనఁబడుచుండుటను బట్టి, నన్నయ యీ ప్రాచీన సంప్రదాయమునే యవలంబించి యుండెనని తలంపఁ దగియున్నది. ఎఱ్ఱాప్రెగ్గడయు నన్నయవలెనే "తద్రచనయుకాఁ" రచించినవాఁడు గావున నారణ్యపర్వశేషమున నక్కరనుగూడ రచించినను, ఏ కారణముచేతనో నన్నయలక్షణమునకు భిన్నంబగు లక్షణముతో నా పద్యములను రచించియుండుటచే నీ విషయమున మాత్రము నన్నయ మార్గమునఁ బోక, తన ప్రత్యేకతను స్వాతంత్ర్యమును జూపినవాఁడయ్యెను. తక్కిన రచనారీతు లన్నిటిలో నన్నయనే యనుకరించి, తద్రచనయో యనునట్లు పూరించినను ఈ యక్కరల రచనమున మాత్రము స్వీయరచన పద్ధతిని బయలు వెట్టక తీరినదిగాదు. నన్నయ యక్కరలలోని లక్షణము తరువాతి లాక్షణికులకు సరిగాఁ గిట్టక పోవుటచేఁ గాఁబోలు, వారు దానిని వదలివేసి ఎఱ్ఱాప్రెగ్గడ లక్షణమునే గ్రహించినారు. తక్కిన లక్షణము విషయముమాట యెట్లున్నను, వీరి యక్కర పద్యములలో యతిస్థానవిషయమగు భేదము స్పష్టముగఁ గనఁబడుచునే యున్నదికదా? ఈ భేదమే ఈ భాగములు భిన్నకవి కర్తృకములని వ్యక్తము చేయుచున్నది. నన్నయయే యీ భాగమునందలి యీ పద్యములలో లక్షణము మార్చి యతిస్థానమును భిన్నముగాఁ జేసెననుట పొసఁగదు గదా? శిథిలభాగపూరణకథ నేనమ్మినచో నీభాగమునందలి మధ్యాక్కరలును నన్నయవే యనవలయును. అతఁడే లక్షణము మార్చి వ్రాసెనని చెప్పవలసి వచ్చును. ఆరణ్యపర్వము

4 ఆశ్వా. 144 పద్యముతో నన్నయకవిత ముగిసినదనియు, 145-వ పద్యముతో నెఱ్ఱనకవిత ప్రారంభించిన దనియుఁ గదా చెప్పఁబడుచున్నది. ఒకే యాశ్వాసముననే నన్నయ కవిత్వమని చెప్పఁబడు దానిలోని మధ్యాక్కరలకును, ఎఱ్ఱనకవితలోని వానికిని భేదము కనఁబడుట కీ భాగములు కేవలము భిన్నకవికర్తృకములని చెప్పుటతప్ప వేఱుకారణ మగపడదు. ఆరణ్య. 3 ఆ. మధ్యాక్కర:—

"మాయావి మాయా యుధములు మాకిచ్చి
మాతోడ రణము
సేయు మివ్విధమునఁ బోవఁ జన దంచుఁ
జెప్పి యయ్యసుర—"

4-వ ఆ, న రెండు మధ్యాక్కరలు గలవు.

"ఏ నేఁడు లగుడెంచె నర్జునుఁ డనిగి
యింత కేతెంచుఁ
బూని దివ్యాస్త్రముల్ వడసి యమ్మహా
భుజుభూరిసత్త్వ—"

—ఆరణ్య. 4-3.

"పదివేల గజములు బలముగలవాఁడు
పౌలస్త్యుతోడఁ
గదనంబుఁ జేసి యనేక యక్షరా
క్షసుల నిర్జించి—"

—ఆరణ్య. 4-105.

ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వములో 4-వ యాశ్వాసమునందే :

" అసదృశతేజుఁడు బ్రాహ్మ
ణాళిక సహితుఁడై కడఁగ
వసుమతియందు న ధర్మ
వర్తులై యున్న మ్లేచ్ఛులను—"

—అరణ్య. 4-312.

నన్నయ మూఁడవ యాశ్వాసములో :

" అరుణ సరోరుహదళ మృదులంబు
లైన యత్తరుణి—"

—అరణ్య. 3-299.

" పరఁగ నాకారణమున నిట్టిదుఃఖ
భారంబుఁ దాల్చి
నరిగె నీశానదిక్కునకు నీ యనుజుఁ
డనిలవేగమున—"

అరణ్య. 3-373.

ఇట్టివి తరువాతి భాగములోని యెఱ్ఱాప్రెగ్గడ చెప్పినవాని లక్ష ణమునకు భిన్నముగా నుండుటయే యారణ్యపర్వశేష కవిత్వము నన్నయది కాదని చెప్పుటకుఁ దగిన ప్రబలాధారమగు చున్నది.

దీనినిబట్టి తెలియున దేమనగా—నన్నయభారతము మూఁడుకృతులు సంపూర్ణముగా రచింపకయే కాలధర్మము నొందెను; ఆతని తర్వాత చాళుక్య ప్రభుత్వమునకును వైదిక మతమునకుఁడఁ బట్టు తగ్గుటచేత, నాతని గ్రంథమునకు దేశమునఁ బ్రచారము లేకుండెను. మతవైషమ్యములచేఁ దరు

వాతికవు లెవరును దానిని జేపట్టలేదు. మతవైషమ్యములు తగ్గి, పౌరాణికమతమునకు మరల నాదరము కలిగినకాలమునఁ దిక్కన నన్నయ మూఁడుకృతులు రచించినాఁడని వినియో, చూచియో, యాతనియందలి గౌరవముచేఁ దరువాతి భాగమును విరాటపర్వమునుండి ప్రారంభించి రచించెను. మఱికొంత కాలమునకు ఎఱ్ఱాప్రెగ్గడ రాజమహేంద్రవరమునందలి ప్రతినిజూచి, ఆ దారణ్యపర్వము కొంతవశిష్యముండుటనుగాంచి, నన్నయయందలి గౌరవముచే నా భాగము నాతఁడు రచించి నట్లే పూరించెను. ఈభాగ మింతకాలము పూర్తికాకుండుటకుఁ గారణమును దెలియక తరువాతివారు నన్నయ మతిభ్రమణ కథను కల్పించి యుందురు. తిక్కనాదులు మూఁడుకృతులన్న ప్పుడు వారు వారు వినియున్న దానిని మాత్రమే వ్రాసిరి; లేదా, స్థూలదృష్టితో చెప్పియుండిరనవలయును. ఇట్లు భారతారణ్య పర్వ శేషము శిథిలభాగపూరణముగాక ఎఱ్ఱాప్రెగ్గడ స్వతంత్ర రచనయనియే చెప్పఁదగియున్నది.

———

శ్రీ వత్సా ప్రెస్సు, రాయపేట మద్రాసు 14.

కోరాడ రామకృష్ణయ్యగారిచే రచింపఁబడిన

ఇతర గ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. ఆంధ్రభారత కవితావిమర్శనము | ... | 2 | 0 | 0 |
| 2. కాళిదాసుని కళాప్రతిభలు | ... | 0 | 8 | 0 |
| 3. భాషోత్పత్తిక్రమము - భాషాచరిత్రము | ... | 1 | 8 | 0 |
| 4. దక్షిణదేశభాషా సారస్వతములు—దేశి | ... | 2 | 8 | 0 |
| 5. సంధి ... | ... | 3 | 0 | 0 |